శముగ) నేనిదేపోవుచున్నాను సుమా ? జాగ్రత !

(అనుచు నిష్క్రమించును)

మదనమాలిని—(మెల్లగా) పోలే ? (అనుచు హారముల బుష్పములు సరి చేయుచుండును)

మాన—(మదనమాలిని వెనుక మెల్లఁగఁ బ్రవేశించి తనలో) పాపమా చెలికత్తె యెంతగాఁ దనకనువర్తనమగు మాటల నుడుచుండి నను లేనికోపమువహించి యీమదనమాలిని దానిని నిష్కారణముగఁ ద్రోసివుచ్చినది. ఔను.

మ॥ ఎటులైన న్మనసిచ్చియున్నయువ దే • డేని బ్రశంసించినన్
గటువై తోఁచదు తిట్టిన న్మధుర మా • కాలస్థితిన్బట్టియు
వ్వటిదే తామనసియ్య జంకఁ గలదై • భాసిల్లుచోనవ్వు డ
వ్వటికన్నన్దనయిష్టమేనుడినఁ గో • పంబే వహింపంబడున్॥

మఱియు నిట్టికోప మీయువిద కొకయలంకారముగ నేయున్నది. పదంపడి యిట్టిముగుదల కిది స్వభావసిద్ధముగూడను నగును.

గీ॥ పాపయుగమున సర్వసా • మాన్యముగను
నీతిబోధకు వృత్తి దు • ర్నీతియెంతో
రమణుఁదొలిసంగమోత్సాహ • సమయమందు
బాలికాయనురక్తి గో • పంబుకింత॥

(అనుచు మెల్లఁగదాని ప్రక్క నుపవిష్టుఁడగును)

మదనమాలిని —(త్రుళ్ళిపాటున లేచి యావలకుఁ బోవుచుండును)

మాన—(తనలో సుస్మితముగ) ఆహా! యీ బెదఱిపోవుటయందు నంద మున్నదే!

మదనమాలిని—(కొంచెమీవలకువచ్చిమానపాలునివక్రదృష్టినిజూచుచు) ఆహా ! యీ నామనోహరుండెంత హాయులు గలవాఁడు ?

చ॥ రమణఁజెలంగు నింత యను • రాగము, నింతటితీవి, యింతయం
దము, నమరేంద్రుకైన మఱిఁ • దమ్ముఁవైరికినైనయున్నె! యీ
సుమశరసాయకుండె కడు • సొంపుగనింపొనఁగూర్పనాడు వు
ణ్యమున ధరన్ జనించి యిపు • డర్మిలి నాపతియాచువచ్చెడిన్.

లేకున్న యింతటిసౌ రేరికిగలుఁగు ? (అనుచు మఱల నోరగా నాతని జూచుచుండును)

మా న—(తనలో) ఔరా ! ఏమీ దీనిసౌందర్యము !

సీ॥ సోము గీమనరాదు • సొగసైనయీమోము
కళలవృద్ధిందు, న • తఁయ్యమెపుడు
మరుశరంబనరాదు • మరులెచ్చునీచూడ్కి
శాంతత్వమిందు, న • తఁయ్యమెపుడు
దొండపండనరాదు • తోరంపుటీమోవి
చవియెంతోయిందు, న • తఁయ్యమెపుడు
సుమగంధియనరాదు • రమణించునీమేను
స్వసుగంధమిందు, న • తఁయ్యమెపుడు
గీ॥ నెంతయని దీనిపొంత, ని • తాంతమగుచు
నొందుసౌందర్యవయవా • ద్యంద మెల్ల
వర్ణనము సేయనలవియా ! • వనితలందు
నధికశృంగారవతియన • నంతేచాలు॥

(అనుచు మఱలదానిని నిరీక్షించుచుండును.)

మదనమాలిని—(జనాంతికముగాఁ దనలో) ఈనవమన్మథాకారుఁడగు నామనోహరునియొద్దఁజేరుటకు నామనసెంత వేగిరపడుచున్నదో, అంతగా నీతని స్పర్శకలుగుమాత్రముసే యేలొకో యొడలు పులకాంకితమగుచున్నది. ఏమిచేయుదు ?

సీ॥ పతిదృష్టిపథమునఁ • బడునంత దత్పద
యుగళిఁ మ్రొక్కఁగనైన • యొక్కబుద్ధిఁ
దటిఁజేరునంతఁ ద • ద్వరపదంబులఁ వ్రాలు
నుత్సుకత మెల్లఁ బో • నొక్కసిగ్గు
జేతులారఁగఁ బతి • సేవనెప్పుడుఁజేయు
చుండంగవలెనను • నొక్కబుద్ధిఁ
జెలులు దాసీజనం • బులు హేళనముఁజేయ
నుందురేమోయను • నొక్కసిగ్గు

గీ॥ నొక్కవైపున సతులధ • ర్మోక్తబుద్ధి
నొక్కవైపునఁ గడుబాల్య • మొప్పసిగ్గు
ద్వివిధమై యేమియును నాకుఁ • దెలియకుండు
నిపుడ చెలివోయె, నాకృత్య • మేమొయిపుడు.

మాన—(తనలో) ఇట్లేయెంతగాఁజూచుచుండినను దనివి యెప్పటి కగు ?
ఇదిసిగ్గిలి కాఁబోలు! నాయొద్దకు చేర సాహసింపకున్నది. కానిమ్ము!
నేనె నాసరకు చేర్చుకొనెద. ఇందుఁ దప్పేమున్నది? (లేచి సమీపించుచుఁ (బకాశముగా) ఓసి ! రమణీ !

గీ॥ వయసునకుచూడఁ గడు జిన్న • వయిననేమి !
సకలశృంగారకావ్య ర•సంబు నెల్ల
గ్రోలియుంటివి సిగ్గేల • బాలలీల
యన్యులెవరుండిరిటఁ జూడు • మంబుజాక్షి.

(అనుచు దానిగడ్డముఁ బట్టఁబోవును)

మదనమాలిని—(పెడమొగమునఁ గొంచెము ప్రక్కకు దొలఁగఁగా)

మాన—(దాని బుజముపై చేయివైచి) ఓసీ !

ఉ॥ ఆదెసఁజూడు మెంతకడు • నందముమీరెడు మల్లెలున్నవో !
యీదెసఁజూడు మెట్లు వన • జేతరభూమిరుహంబులున్నవో !
యేదెసఁగాంచిన న్మనసు • కెంతయొ హర్షముఁగూర్చు నూవెనీ !.
కేదెసయిష్టమో యచట • కేఁ గొనిపోయెద రమ్ము ముద్దియా !

(అనుచు దానిఁ గొంచెముదూవలకుఁ గొంపోయి దానిముఖము నిరీక్షించుచుఁ దనలో) దీని నెట్లైననుఁ బల్కరించుకొనవలెను. (ప్రకాశముగా) తన్వీ !

ఉ॥ ఈవును బాల్యమాదియును • నెంతయొ నేర్పరివంచు నేను ము
న్నే వినియుంటి నైన నిట • నేనొనఁగూర్చిన యీవనంపు సొం
పేవొనగూర్చినట్టి భవ • దీయ జనిస్థలి, నావనంపు సొం
పేవిధినుండు ? భేదమెది? • యేది చమత్కృతి నొప్పు ? చెప్పవే.

(కొంచెము నిదానించి) ఏమి ! పిచ్చిదానా ? (అనుచుదాని గడముఁబట్టి)

ఉ॥ దేనికిఁ జెప్పవేమి? మది • దేనికి సంశయమొందె దీవు! నా
దానవు కావొకో! మఱిఁక • దాచకు నీయభిలాషమెద్దియో
దాని వచించి తత్ఫలముఁ • దారొకను మిట్టుల ముగ్ధగాఁ బలిక
దైనికుఁ జేయఁగాఁదగదు • తప్పసుమా సతివై ననీకునూ॥

(దానిచేయిఁబట్టుకొని) రమ్ము! మనమిర్వుర మావేదికపై నేకాంతముగా గూర్చుండము రమ్ము. (అనుచు నా వేదికసమీపమునకు జేర్చి) నీవిటఁగూర్చుండుము. (కూర్చుండబెట్టి యెదుటనున్న హారములను చేతనెత్తిపట్టుకుని సుస్మితముగ) హారములకూప్పచమత్కృతినీ దేనా?

మదనమాలిని—(శిరమువంచి చిరునగవున మెల్లగా) ఔను.

మాన—(సంతసముగ) ఆహా! ఇవెంతయందముగ నున్నవి? (దానిబుజము
పై చేయివైచి తనతలయొగ్గి) ఇదుగో! నీవు మదనమాలినివా!
కుసుమమాలినివా?

మదనమాలిని—(చిరునగవుతోఁ బెడమొగముఁ బెట్టి మిన్నకుండును)

మాన—చెప్పకున్నపోనీ! ఈ రెండవరెవరికి?

మదనమాలిని—రెండును దమకే.

మాన—రెండును నాకే?

మదనమాలిని—ఔను.

మాన—కాదు. ఇవి మనయిర్వురకును జెరియొకటి. అగునా?

మదనమాలిని—(చిరునగవున మిన్నకుండును)

మాన—అంతే నీభావము. ఇదుగో! దీనినే నలంకరించుకొనుచున్నాను.
(అనుచునట్లుచేయఁబోగా)

మదనమాలిని—(చప్పునలేచి) నే నలంకరించెదనిటిండు.

మాన—అట్లే కానిమ్ము. ఇదిగో! (అనుచు నొకటియ్యఁబోగా)

మదనమాలిని—(రెండును బట్టుకొనును)

మాన—రెండును దేనికి?

మదనమాలిని—పనియున్నది.

మాన—సరే (అనుచు రెంటినివదలును)

మదనమాలిని—(రెండు నాతనిమెడలో వేసి కూర్చొనును)

మాన—(తనమెడలోని దొక్కటిదీసి దానిమెడలోవైచి దాని ప్రక్క నుపవిష్టుఁడై దానిఁజూచుచు) ఆహా యిప్పుడింకను నెంతరామ ణీయకమున నుంటివి!

చం॥ కలువలుఁదమ్మిమొగ్గలును • గల్గుసరోవరమందు హంసముం
బలె సిరిదాల్పువిస్తృతపు • వక్షమునందలి కౌస్తుభంబలెఁ
దలఁప వికాసితంబయిన • తామరపుష్పములోని కేసరం
బులవలె నెంతోయందమిట • బొప్పయె నీయెడ నీవు జూడుమా.

మదనమాలిని—తనమెడలోనిహారమును జేతఁబట్టుకొని చూచుకొనుచు (మెల్లఁగ)మీాకు నిజముగ నాయీాకూర్పంతయందముగనున్నదా?

మాన—(ఆలకించుట నభినయించి) యేమనుచుంటివి?

మదనమాలిని—(చిరునగవుఁ బెదవిఁ గొరుకుకొనుచుఁ బెడమొగముఁ బెట్టును)

మాన—(దానిఁజూచితనలో) అంతలో దీనికిసిగ్గు, మఱలఁబల్కరించు కొనెద; (ప్రకాశముగ) ఏమీా! నీవనునది?

మదనమాలిని—(ఆతనివైపుఁజూచి మఱలనట్లే చిఱునగవుఁ బెదవిఁ గొఱుకుకొనుచుఁ బెడమొగముఁ బెట్టును)

మాన—(దానివీపుఁ జరచుచు దాని గడ్డముఁ బట్టుకొని) మనోహరీ! నీనుడునుడువులు నాకువినపడక నిన్నిట్లువ దేవదే(ప్రశ్నించుట కాదు.

ఉ. క్షీరములుండి చక్కెరకు • చెంత నొకానొక గవ్వయైన లే
కారయువాని చందమున • యందముమీారిన నీదు సంగమం
బారయఁ గల్గినన్ హృదిని • హాయినిఁగూర్చెడు నీమృదుస్వనం
బారయుచుంటి నామనను • కట్టికొరంతిఁక తీర్పవేడదన్.

కనుక చెపుము! ఇంతదాక నీవేమంటివో యిప్పుడసలే మఱచితి. భిడియపడక చెప్పుము. (దానిముంగురులు సర్దుచు) ఊఁ చెప్పుము. (దానిశిరమును గడ్డముఁబట్టి) చెప్పవేమి?

మదనమాలిని—(గారాబముగ) ఏమి చెప్పమనెదరు?

ఉ॥ సిగ్గగుచున్న దేమియును • జెప్పఁగఁజాలను దేనికోసమో
యగ్గలమాచు నాహృదయ • మందున యేదో జనించుచుండె నా

యగ్గలమిందుకై చను న • టంచును సైతముఁ జెప్పరాని ద
సిగ్గుకుమూలమై చెలఁగుఁ • జెంతకుమీరిటు వచ్చువెంటనే.

మాన—(తనలో) ఆహా! యేమీ దీని నర్మగర్భోక్తి! ఇది ముగ్ధయా? ప్రౌఢయా? ఔను. ఇది వయోమాత్రముగ్ధయగు విద్వత్ప్రౌఢ. మఱియుఁ బ్రియసంగమోత్సుకసంరంభయగు నవయౌవనారంభ. (ఎదుటి దిశఁజూచి నిగుడ్చి) ఆవచ్చునదెవ్వరు? ఓహో! అది దీనివేడుక చెలికత్తియే, ఆపూఁబొదలచాటునుండి వచ్చుచున్నది. పూలపాన్పేమో యమర్చివచ్చుచుండును. (మదనమాలిని జూచి ప్రకాశముగా) ప్రేయసీ! నీవు నిజముగా సిద్ధసంకల్పవు సుమా! సద్యస్సాఫల్యఫలసంఘటనాసంకల్పవన నీకుగాక మఱొకరికి జెల్లదు. అదిగో నీచెలివచ్చుచున్నది. దేనికివచ్చుచున్నదో గ్రహింపుము. (నేపథ్యంబున)
చెలి, రాజ్ఞి! (అనిపిలచును.)

మదనమాల—అదిగో! నాచెలి దేనికో పిల్చుచున్నది. పోయివచ్చెదను.

మాన—పొమ్ము.

మదనమాల—(నిష్క్రమించును)

చెలి—(ప్రవేశించి వినయముగ) ప్రభూ! రాజ్ఞి పిల్చుచున్నది.

మాన—(చిఱునగవున) ఎచ్చటనుండి?

చెలి—(చిఱునగవున) నాతోరండు.

మాన—సరేపద. (నిష్క్రమించుచుండఁగా నవనికజారును.)

ప్రదేశము-ఏకాంతస్థలము.

మాన—(ప్రవేశించుచు)

చం॥ వయసనునట్టిదే పరమ • వస్తువు దానినిమించు వస్తువే
దియును గనంగ లేమనుచు • దిట్టతనంబునఁ జెప్పుమూర్ఖులక్
దయఁగననౌన! యావయసు • దాపురమేయగునంత కష్టమే
దియుఁగననౌన! యెవ్వరిని • దీనులఁ జేయదె! కామవశ్యయై॥

చెలి—(ఒకవైపునఁ బోవుచుండును)

మాన—(దానిఁజూచి) ఎవరాపోవునది?

చెలి—(చేతులు జోడించుకొని వినయముగ) ప్రభూ! ఏమి సెలవు?

మాన—మీరాజ్ఞిపుడేమి చేయుచున్నది ?
చెలి—పురాణకాలక్షేపముఁ జేయఁబోవుచున్నది.
మాన—(ఆశ్చర్యముగ) ఎట్లు ! పురాణకాలక్షేపమా ?
చెలి—మీరు లేనప్పు డెప్పుడేదో యిట్టి కాలక్షేపమే చేయుచుండును.
మాన—ఈరోజు నెట్టికాలక్షేపము జరుఁగబోవుచున్నది.
చెలి—శ్రీ మద్రామాయణ మహాపురాణ కాలక్షేపము.
మాన—అట్లనా ?
చెలి—తమరు సైకము దయసేసిన బాగుండునని కుతూహలపడుచున్నాను, పిదప మీదయ. ఇకఁ నాకు సెలవిండు.
మాన—సరే పొమ్ము .
చెలి—(చిత్తము. నిష్క్రమించును)
మాన—(తనలో) నేను లేని సమయం దెప్పుడును నారాజ్ఞి వృథాకాలక్షేపమొనర్చకఁ బురాణకాలక్షేపముఁ జేయుచుండునా ? మంచిది. నాజన్మలో నాకు నిన్నటిదిన ముద్యానంబున నారాజ్ఞి నాకొనగూర్చిన తనముగ్ధ శృంగారమే వర్ణనాతీతంబగు నానందమొందించినది. ఇఁక నీ పురాణకాలక్షేపమున నెంత యమందానందమొనఁగూడునో కందునుగాక ఆహా యేమి నాభాగ్యము !

ఉ॥ ఎందఱు లేఱు భూవరులిఁ • కెందఱు లేరు మహావిదుల్భవిఁ
సుందరు లెందఱుండరొకొ ! • చూడ మువారినియెల్ల ! యిప్పుడీ
చందముగాను సర్వవిధ • శాస్త్రపరిజ్ఞతఁగల్గి యెంతయో
యందము మీఱు నాగృహిణి • యట్టిది యేరికిలభ్యమయ్యెనే.
ఏమంటి ! ఛీఛీ ! యెంత మందమతి నగుచుంటి .

ఉ॥ అందము చేల స్త్రీలకిల • నారయ ! విద్యయుమాత్రమేల ! యా
యందము విద్యయున్నిటుల • యందురహిం జెలు వొందుఁగాక! యా
నందముఁ గూర్పఁజాలునొకొ • నాథులకెల్ల ! యివన్నిచూడఁగాఁ
జెందముగాదు మానసము • సత్యసతీత్వముఁ జెంద కిమ్మహిన్.

ఉ॥ అట్టియెడ స్మదీయహృది • యందున యేదొకపై విలాసముగ్
బట్టి మహాద్భుతంబుగను • భామరుపోలెను బొంగుచుంటినే

నెట్టిఘనుండ ! నాగృహిణి • యెట్టిదొ ! దానిసతీత్వమెట్టిదో !
గట్టిగ నారయన్వలెఁ ! • కాంతలహృద్గతి నమ్మవచ్చునే!—

నమ్మకమాత్రము చేయునదేమున్నది?

గీ॥ పరసతీ చేష్ట నెప్పుడే • భంగినైన
నెట్టివాఁడైనను గ్రహియింప • గట్టిఁడౌను
స్త్రీయమందు నామాత్రంబు • విధముఁదెలియ
శక్యమే ! శక్యమైనచో • జగతిమనున

కాని యెటులైనను దీనిగుణమును బరీక్షించియే తీరవలె.

సీ॥ దేహమా మేలిమిం • దేలినబంగారు
వన్నెమీఱుచుఁగను • పండువయొడు
నవయువ సౌందర్య • మా కోమలంబునై
చక్కనై హృదిసంత • సంబునిడెడుఁ
జూడ్కియా వక్రమై • సూనశరోపమై
సన్యాసికైన హృ • త్సంగమిడెడుఁ
గంఠస్వరంబదు • మృతినపాషాణంబు
నకునైన మిక్కి • లానందమిడెడు

గీ॥ వైదుషీత్వంబ విబుధుల • ప్రతిభఁగనెడు
నిట్టి సర్వశుభాంగ సం•ఘుట్టమయెడు
నట్టి మదనమాలినిహృది • యమలమగుచు
నుండకుండిన లోపంబు • నిండుకాదె !

భటు—(ప్రవేశించి) ప్రభూ ! ఆనందశర్మగారు మీ దర్శనమునకు వేచియున్నారు.

మాన—(భటునిఁజూచి సంతసముగ) ఓహో ! సత్వరములోనఁ బ్రవేశ పెట్టుము.

భటు—చిత్తము. (నిష్క్రమించును)

మాన—(సంతసముగఁదనలో) ఆహా ! ఈయానందుని నామోచ్చారణ స్మరణశ్రవణాదులమాత్రముననే నాహృదయమెప్పుడు నత్యానందమయమగుచుండును. ఔరా !

గీ॥ యౌవనారంభ దశయందు • నైనయువిద
యందు సఖ్యత్వమెట్టిదో • యాదినుండి
యైన యాబాల్యమిత్రత్వ • మట్లియెపుడు
మఱువరానిదెయగుఁ జెల్మి • మహిమయేమొ !

అదిగో! ఆనందుఁడు వచ్చుచున్నాఁడు. ఈతఁడు నాప్రాణసముఁడు. ఆమదనమాలిని నాప్రాణసమ. ఈతఁ డధికవేదాంతి. యది యధిక విద్యావతి. ఈతని నిశ్చలత్వమెట్టిదో ! దాని సతీత్వమెట్టిదో ! ఈతఁడును సుందరాకారుఁడును సకలకళానిధి. ఆదియును సకల శృంగారవతి, చాతుర్యసీను. ఈతఁడును యౌవనుఁడు, నదియు యౌవని. నేనో ఈ యిద్దరకును సర్వసముఁడ. ఆహా ! నేనొక సూత్రధారుఁడనై వీరిద్దర నొకచోఁ జేర్చి యొక పరీక్షానాటకము గల్పింతునా ?

ఆనం—(ప్రవేశించుచు) మిత్రమా !

మాన—(త్రుళ్లిపాటున నానందునిజూచి) ఓహో ! ఆనందా ! మంచి
సమయమునకే వచ్చితివోయి !

ఆనం—(ఆశ్చర్యముగ) ఏమది?

మాన—ఇప్పు డంతఃపురమునఁ బురాణ కాలక్షేపము జరుగుచున్నదట.

ఆనం—ఆపురాణమేమి? ఆజరుపువారెవరు?

మాన—పురాణము రాజ్ఞీకృత శ్రీమద్రామాయణ మహాపురాణము,
జరుపునదియు రాజ్ఞియే. వింద మురమ్ము.

(అనుచు నాతని చేయిఁ బట్టుకొనును)

ఆనం—అంతఃపురమునకు నేను దేనికి?

మాన—రావోయి! (అనుచు గుంజుకొనిపోవుచుండును.)

(అంతలో నవనికజారును)

మఱల నవనికలేవగా, మదనమాలినీ అంతఃపురము.

(రామాయణము ముందుంచుకొని మదనమాలినియు, వినుటనభిన
యించుచుఁ జెలికత్తెయు రంగమునను నుందురు)

శ్లో॥ త్వత్సమీపే స్థితాంరామ! కోవామాంధర్ష యేద్వనె
ఫలమూలాऽదికం యద్య త్త్వభుక్త్వావశేషితం

తదేవామృతతుల్యంమే తేనతుష్టా రమామ్యహం
త్వయా సహచరంత్యామి కుశాఃకాశాశ్చకంటకాః॥

మదనమాలిని— (ఇట్లు చదువుచుండును)

(ఈపై శ్లోకముఁ జదువుమధ్యలో మానపాలానందులు ప్రవేశించి వినుటనభినయించి నిలుచుండియుందురు)

మదనమాలిని—(వారినిజూచి గ్రంథమునుమూయుచు లేచును)

(చెలియు వారినిజూచి లేచును)

మాన—(మదనమాలినితో) ఆఁ ఆఁ గ్రంథమునుమాత్రము మూయకు.

(ఆనందునితో) రావోయి! (అనుచు నాతనిఁబట్టుకొని యచ్చటి శయ్యాదాపునఁ నాతనిఁజేర్చి తానందు నుపవిష్టుఁడగును)

ఆనం—(బెదరు నభినయించుచుండును)

మాన—(ఆనందునిజూచి) దేని కనుమానించుచున్నావు! ఇటఁగూర్చుండుము (అనుచు స్వయముగా నాతనిశయ్యపై గూర్చుండఁబెట్టును)

మదనమాలిని—చెలి- (గుసగుస లాడుకొనుచుందురు)

మాన—(వారిర్వురిచర్యగాంచి. వారలతో) ఏమాగుసగుసలు?

మదనమాలిని—చెలి- (త్రుళ్లిపాటున మిన్నకుందురు)

మాన—(వారలతో) ఇప్పటికికథ యొంతవరకైనది?

మదనమాలిని—(మందస్మితము సేయుచు సిగ్గుతోఁజెలినిజూచును)

మాన—చెప్పరేమి?

చెలి—(మందస్మితముతో మెల్లగ) ప్రభూ! ఒకర్రపాతికపాలైనది.

మదనమాలిని—(అపవారించి చెలితో) పాతికపా లేమిటి! సీసు ఖం!

చెలి—కథా భాగముఁ జెప్పుచున్నానమ్మా!

మదనమాలిని—అట్లుగాదు. కథా సందర్భముఁ జెపుము.

చెలి—(మానపాలుతో) ప్రభూ! ఇప్పుడు రామునరణ్యప్రయాణఘట్టము జరుఁగుచున్నది.

మాన—(విస్మితముగ) ఓహో! ఇప్పుడు దుఃఖరససంఘట్టిత ఘట్టముజరుగుచున్నదా! దుఃఖరసమేమిలే! మధ్యమధ్య నేమేమిరసములు మాఱుచున్నను మొత్తముమీద రామాయణమంతయు నానందమయము, ఏమోయి యానందా? (అనుచునాతనిజూచును)

ఆనం—(సంతసముగ) ఔను.
మాన—(మదనమాలినిజూచి) ఊఁ ఇఁక నారంభింపుము.
మదనమాలిని—(చెలితో రహస్యముగ) ఆయానందపండితునిచే నీపూటఁ
గాలక్షేపము జరుపునట్లుకోరుము.
మాన—(మదనమాలినిజూచి) ఇంకనేమిటా యాలోచన?
చెలి—(వినయముగ) ప్రభూ! అనాడానగర బాహ్యారామమున దర్శన
మొసంగిన యీయానందపండితులు మఱల మాపుణ్యవశంబున
నేటికిట్లు మీవెంటనిచ్చటకేతెంచి దర్శనమియ్యఁగల్గిరి. అందుచే
వీరిచేతనే యీపూట నీసత్కథా కాలక్షేపము జరిఁగిన బాగుండు
నని రాజ్ఞితనయాశయమును వెలిఁబుచ్చుచున్నది. పిదప మీ దయ.
మాన—(కనులుమూసుకొనితనలో) ఊఁహూ. ఇదియానొకందుకు మం
చిదే, (ఆనందునిజూచి ప్రకాశముగ) ఏమానందా?
ఆనం—(తనయంగీకారమును సూచించును)
మాన—(మదనమాలినిజూచి) రాజ్ఞీ! వీరిచే నిట్టి సత్కథా కాలక్షేపము
మఱొకప్పుడు జరుఁగవచ్చును. నీవుమాత్రమిఁక నాలస్యముఁజే
యక నారంభింపుము.
మదనమాలిని—(మఱల మందస్మితముగుసిగ్గుతోఁ జెలి నిజూచును)
చెలి—దేనికమ్మా? సిగ్గు! త్వరగాఁ గానిమ్మ.
మాన—ఓహో హో! రాజ్ఞీ! దేనికిసిగ్గునీకిపుడు?
శా॥ నేనో! ప్రాణధవుండనీకు మఱివీ • నీకౌజూడ నీకందునా
ప్రాణస్థానము నీచెలేయదియు నీ • ప్రాంతంబు నింకన్యులే
రైనా పొంచొనియుందురే చెపుమ ని • న్నాక్షేపముఁ జేయు రై
రాణుల్ రాణవసించుచోట భయమే • లా! మేలాకో! లావొకో!
గీ॥ రమణనొప్పారు రామాయ • ణమను కావ్య
రమవిలాసంబు రాసంబు • రంజితంబు
నగు విధంబు నీసమ్ముఖం • బందు విను ము
దంబునుంటిమి చెపుమిక • సంబరముగ!
ఆనం—(చిఱునగవున మానపాలుతో)మిత్రమా! రాజ్ఞి కన్నముస్నే నీబో
ధనాపురాణ మిట్లు ప్రబలమగుచున్న యింకా రాజ్ఞి చెప్పుట

కవకాశమేది? (మదనమాలినిజూచి) అమ్మా! ఇంక సిగ్గుంజెందక సత్వరము బురాణముచెప్పుటకానిమ్ము! నీవును నీమనసున నొక విషయ మాలోచింపుము.

ఉ॥ చిన్నతనంబునుండిఁ గదఁ • జిత్తమునెల్ల గురుప్రకాండమం
దెన్నికఁజేసి కష్టముల • నెన్నొసహించి వహించు విద్య సి
గ్గన్నది వీసి బైల్పఱచు • నప్పుడకాదొకొ సార్థకంబగుఁ
బిన్న వెనీవు విద్యలకు • మిన్నవు నీకొక నీతి శ్రోత్రయే!

చెలి—(మదనమాలిని బుజముపైఁజేయివైచి) అమ్మా! ఇంకను సిగ్గెందుకుఁగానిమ్మమ్మా!

మదనమాలిని—(వారించి) సిగ్గుఁగాదు ఎగ్గుఁగాదు(అనుచు దలవాల్చును)

చెలి—(తలయొగ్గి) మఱి దేనికి

మదనమాలిని— దేనికో నీకేమి తెలియు!

గీ॥ ఘన ఘనాఘనాఽకాశసం • కాశ విద్య
తందు దివ్వెచందాన ము • హాజగాన
నిగమనిగమాంగ పఠనీయు • లగుఁబురుషుల
యెడను స్త్రీవిద్య తేజోవి • హీనకాఁదె!

అందుచేత నేను జంకుచుంటిః తెలిసినదా!

ఆనం—(సంతసముగ తనలో) ఆహా! ఏమీ యుపమానోపమేయము! మఱియు నిదొక యెత్తిపొడుపుమాట కానిమ్ము (ప్ర) అమ్మా! ఒక్కమనవి!

మదనమాలిని—(ఆనందుని జూచును)

ఆనం—

గీ॥ ప్రౌఢతనమునెంత • వఱలినఁ బుంవిద్య
స్త్రీల విద్యయంత • చెలువుగాదు
దివ్యమైన శ్రీల • నవ్యవిద్యాప్రకా
శంబు డంబునొ ము • దంబొసంగు.

అందుచే నింక నీవాసందియమును వీడుముః.

మదనమాలిని—అట్లైనచో నేనింక ధన్యురాలను.

మాన—ఊఁ! ఇంకనైనను ప్రారంభింపుము.

మదనమాలిని—చెలీ! కూర్చుండుము (చెలికూర్చుండఁగాఁ దానుఁగూ
ర్చుండి రాగమాలాపించి)

శ్లో॥ త్వత్సమీపే స్థితాంరామ! కోవామాంధర్వ యేద్వన
ఫలమూలాఽదికంయద్య త్తవభుక్త్వావశేషితం
తదేవామృతతుల్యంమే, తేనతుష్టా రమామ్యహం,
త్వయా సహచరంత్యామికుశాఃకాశాశ్చకంటకాః.
(అట్లు చదువును)

ఆనం—(ఆలకించుచు సంతసముగ శిరఃకంపముఁజేయుచుండును)
మాన—(ఆలకించుచు సంతసముగఁ దనలో) ఆహా! ఇది సంగీతసాహిత్య
ములయందు నతి నిపుణయనుట విశేషోక్తి గాదు.

చెలి—(మదనమాలినితో) ఇఁక దీనియర్థముఁ జెపుము!
ఆనం—(వారించుచు) ఆఁగుము! రాజ్ఞీ! మఱల నొకతూరి యాశ్లోకము
ను జదివి వినిపింపుము.

మదనమాలిని—చిత్తము (మఱల)

శ్లో॥ త్వత్సమీపే స్థితాంరామ! కోవామాంధర్వ యేద్వన
ఫలమూలాఽదికంయద్య త్తవభుక్త్వావశేషితం
తదేవామృతతుల్యంమే, తేనతుష్టా రమామ్యహం,
త్వయా సహచరంత్యామికుశాఃకాశాశ్చకంటకాః.

ఆనం—(సంతసముగ) ఆహాహా! చాలబాగున్నది. ఇంక దాని భావమును
విశదపరపుము.

మాన—(ఆనందునిపైఁ జేయువైచి) ఆనందా! ఇంతయుప్రసంశోషుఁడ
వేమోయి!

గీ॥ పాంకితీభావమిల్ల, భా • వప్రకటన
మందుఁ గ్రాలుగా నీగాన • మందుమాడ
నేమియున్నది నూ? గాన • మింతయింత
బుడుతలకుపైత మలవడుఁ • బుడమినిపుడు.

ఆనం—ఐనచో నిప్పుడేమందువు?
మాన—భావప్రకటనమగుఁబిదప నిట్టిసంతసమనుభవించినబాగుండునందు,

ఆనం—సరే కానిమ్ము. (మదనమాలినిజూచి) అమ్మా! ఇఁకఁ బ్రారంభింపుము.

మదనమాలిని—చిత్తము. (చెలిభుజముపైఁ జేయివైచి) చెలీ!

(చెలినిజూచి) చెలీ! ఈ రాము నరణ్యప్రయాణఘట్టమం దింతకు మున్నా సీతామహాదేవి కా శ్రీరామచంద్రప్రభుం డేమని చెప్పెనో వింటివా?

చెలి—విన్నాను.

మదనమాలిని— ఏమని?

చెలి—(సాలోచనముగ) ఏమనఁగా? ఆఁ. అవును. సీతకుచెప్పిన రాముని ముఖ్యాభిప్రాయము గదా? నీవడుగునది?

మదన—ఔను.

చెలి—ఏమన్నది? ఓసీతా! నీవు సుకుమారివౌటచే ఘోరారణ్యంబుల కేగు నాతో నీవు రాఁజనదు. నీరాను నన్న ప్రయత్న మిఁకనుడుఁగుము! అనియేకదూ?

మదన—ఔనా! తర్వాత సీతాదేవి చెప్పుచున్నదివినుము. "త్వత్సమీపేస్థితాం రామ!" హేరామా! నేను సుకుమారిననియు, మీ రేగునది ఘోరారణ్యములకనియు నేను మీ వెంటవచ్చుచో నందు మిగులఁ గష్టము లొందుదు ననియు నన్నేల భయపెట్టఁ జూచెదరు? "త్వత్సమీపేస్థితాం రామా! కోవామాంధర్షయేద్వనే" హే శ్రీరామచంద్రా! మీ సన్నిధినుండఁగా నెట్టియరణ్యములందైన నెవరి కేమిభయము కల్గు? మఱియు సరియగు నాహారపదార్థములు లభింపక కృశించెదనంటిరి. "ఫలమూలాదికం యద్యత్త్వభుక్తావశేషితం, తదేవామృతతుల్యం మే. తేనతుష్టా రమామ్యహం" (సుస్మితమభినయించుచు) ఆహాహా! వింటివా? "హే శ్రీరామచంద్రప్రభో! మహాసుకుమారులగు మీచేతనే యేకందమూలాదులు భుజింపఁబడుచున్నవో ఆమిగిలిన కందమూలాదులే నాకు మిగుల నమృతోపంబులై భోజ్యములగు; నందుచేతనే యీప్రయాణమునకు నేను సంతోషించుచుంటి. మఱియుఁ గుశకాశకంటకాదులచే సంచరణసమయంబున కష్టము కల్గునంటిరి. అదెట్లుకల్గు? "త్వయాసహాచరంత్యామి" నేను

మీ వెంటవచ్చునప్పుడు "కుశాః కాశాశ్చకంటకాః" అదర్భలు, ఆరెల్లుదుబ్బులు, ఆకంటకములు మొదలగునవి నన్నేమిచేయ గలవు? "వృష్ట్వా స్తరణతుల్యామే" చూచితిరా! నాకవన్నియుఁ బూలపాన్పువలెసౌఖ్యమిడఁగలవు భవిష్యంతినసంశయః" నాకారీతి సౌఖ్యము నే యిడఁగలవు. ఇందెంతమాత్రమును సంశయము లేదు.

మాన—(సాక్షేపముగ) ఆహాహా! ఏమి భక్తిరసమోయి భక్తిరసము

ఆనం—(విస్మితముగ) ఏమోయి! రామాయణసుశ్రావ్యముగఁ జెప్పు చున్నను నీకేమియు నచ్చుట లేదుగా!

మాన—అదికాదోయి! సీతప్రస్తావనము నాకు నచ్చుటలేదు.

ఆనం—ఎందుచే?

మాన—ఏదోకార్యార్థముగ శ్రీరాముని సీత వెంబడించెదననుట

ఆనం—అందుఁ దప్పేమున్నది?

గీ. అధిపుఁడనువందు సగభాగ • మాలుపాలు
నాలుతనువందు సగభాగ • మధిపుఁబాలుఁ
గాన యాతనువు రెండు • గా నొనర్చి
సంచరింపగఁ గూడదే • సమయమందు.

మాన—(మఱల నత్యాక్షేపముగ) ఈధర్మ మేశాస్త్రమందున్నదోయి

ఆనం—భార్యయర్ధాంగి యను భావ మేశాస్త్రమందుండునో ఆశాస్త్ర మందు.

మాన—(మదనమాలినిఁజూచి) ఏమే! ఈవిషయమున నీయభిప్రాయ మేమి?

మదనమాల—(మందస్మితంబగు సిగ్గునఁ బెదవిఁ గొఱుకుకొనుచుఁ బెడ మొగముఁ బెట్టును)

మాన—అదిగో! ఆసిగ్గె విద్యావివాదంబున కూడదు.

గీ. సర్వవేద పురాణ శా • స్త్రంబులందు
నర్థసంగ్రహ రసికత్వ • మధిగమించుఁ
బండితుల ముందు జంకకే • ప్పట్టెదేనఁ
దర్కమును జేయఁజాలె దధిఁ • దరచుభంగి.

ఈవిషయము తెలియదా? ఏమీపలుకవు?

మదనమాలిని- (మెల్లగ) తెలియును.

మాన—ఐనచో సీత ప్రస్తావమున నీయభిప్రాయమేమి ?

మదన—ఆయానంద పండితుల యభిప్రాయమె నాయభిప్రాయము.

మాన—నాయభిప్రాయము మాత్రమదికాదు.

ఆనం—(మానపాలునితో) నీయభిప్రాయమేమోయి ?

మాన—నాయభిప్రాయ మేమనెదవా ?

గీ. భార్యయర్ధాంగి యనుదాని • భావమెల్ల
సతియుఁ బతియును దమ హృది • సంఘటించి
మెలగవలెనని గాని భూ • స్థలిని యొకరి
వెంబడొకరేగుటని గాదు • వెఱ్ఱివిధిగ.

మదనమాలిని—అట్లయిన నాయభిప్రాయము నైతము వెల్లడింపఁ దగునా ?

మాన—నిస్సందేహముగ, విద్యావివాదమునగాని మఱి యేవిషయమం దునగాని స్వాభిప్రాయ ప్రకటనముకంటె మఱొండు ప్రాజ్ఞులకు పాడిలేదు. ఇంక నీయభిప్రాయమేదో వెలిఁబుచ్చుము.

మదన—చిత్తము.

ఉ. కాంతకుగాకఁ గాంతుడును • గాంతునకట్టులెకాకఁ గాంతయుఁ
స్వాంతములందుఁ గష్టసుఖ • సంగతులొండొఁగ రాదటంచుమీ
స్వాంతము నైతమొప్పెడిని • భాగయోఁగాని తదీయపక్షి నే,
స్వాంతములందునొండ సహ • చర్యత నిర్వారునొప్పుకొప్పునే ?

మాన—అదిగో, దానినే! నేనొప్పను.

ఆనం—(మానపాలు స్పృశించి) దేనినోయి!

మాన—సతీ పతుల సహచర్యత్వమును.

ఆనం—ఎందుచే?

మాన—అది సతీధర్మమునకు విరుద్ధము.

ఆనం—విరుద్ధ మెట్లగు?

మాన—అట్లగుటను చెప్పెద.

మ. పతి దేశాంతరమేగుచో నపుడు సత్ • భావంబుఁ జెన్నార సత్
సతియేనైన నహర్నిశంబు పతి ని • ష్ఠన్భర్తృచింతా పరా

యిత చిత్తంబున నేకభుక్తను దా • నింట న్జరింపన్వలెన్
బతిసాన్నిధ్యము గల్గుదాఁక సతికిన్ • మార్గంబె సన్మార్గమా.

అంతియేగాని అసలు అంతఃపుర వాసార్హయగు రాజస్త్రీయై యుండి, భర్తయగు మాత్రముననే యాతని వెంబడించి బహిరంగ సంచారమున కుద్యమింపఁదగునా? అదేమనిన,

శా. లీలామానుషరూపులై ధరణిలో • శ్రీయున్మహావిష్ణు వా
పౌలస్త్య వ్యధ జేయుకై చనిర నే • భావంబుఁ జూపెట్టుదే
మో! లోఁతున్పరికింప నందుననునా! • నొప్పొనె! యీరీతి సీ
తాలోలేక్షణ మానవీత్వము స భ • ర్తన్వాసి బైలొందుటల్.

ఆనం—బైలొందునంతనే సీతమానవీత్వమున కొందినలోపమేమి?

మాన—సతీధర్మ విరుద్ధమే.

ఆనం—సతీధర్మమందు భర్తృసహచర్యత్వము విరుద్ధమను నర్థమున్నదా?

మాన—అసలు కూడవచ్చెద ననునంతనే భార్యను వెంబడించుకొనిపోవు రాముడే పిచ్చివాఁడు.

ఆనం—ఇఁకసరే. మఱి రాముఁ బరీక్షకోటి నెత్తుకొంటివా? (మదనమాలినిజూచి) అమ్మా! నీవుమాత్రము తదుపరిశ్లోక మారంభింపుము.

మదనమాలిని—ఇక నారంభించున దేమి? ఒకవైపున రాముడే పిచ్చివాఁడనుచుండఁగా నీరామాయణమిఁక పిచ్చిరామాయణమే కదా! ఇట్టి పిచ్చిరామాయణమేల చదువవలె?

మాన—రామాయణమును పిచ్చి రామాయణ మనేకాదు. నిరర్థక రామాయణమని సైతముఁ జెప్పవలసి వచ్చినది.

ఆనం—ఎందుచే?

మాన—ఒక గ్రంథకథా భాగమందలి నాయకీనాయకులెప్పుడుత్తమ పాత్రతవహింపఁ బడరో అప్పుడే యది సర్వార్థములందును, వ్యర్థముగఁ బరిణమింపఁబడు,

ఆనం—ఈరామాయణ, (అర్ధోక్తిలో)

మాన—(వారించి) నేజెప్పునదంతయుఁ బూర్తికానిమ్మ! ఇఁకనట్టి నా

యకియుందుత్తమ పాత్రత్వమనఁ బాతివ్రత్యమొకటే. అది యేమో యిట్లున్నది.

ఆనం—ఇట్లున్నదనఁగా,

మాన—ఈ నిర్ణయమునకు మఱలవచ్చెదను. ముందు నాయాక్షేపణ భాగమంతయుఁ బూర్తిఁగానిమ్ము. ఇంకనెన్నోవిషయంబులనొప్ప వలసిన పాత్రత్వము నాయకునిది, అట్టినాయకుండగు శ్రీరాముని లీల యెట్టిది?

సీ॥ తనకెట్టి యపకార • మును జేయకున్నట్టి
స్త్రీఁజంపె, విప్రుని • తేజమణఁచె
స్త్రీకిదత్తంబైన • చెదువరంబొకపాడి
యనుచెంచి కన్నుల • వనటముంచె
నవకోమలాంగియౌ • యువతిని బహిరంగ
ముగ నటవులమధ్య • నొగడఁజేసె
రమణిగోల్పోవు మా • త్రనె శాపదుఃఖించి
యన్యాశ్రయత శత్రు • లణగజేసె
గీ. నిటులధర్మంబుఁ, బెద్దల • యెడలభక్తి
యుక్తమగుదీక్ష కన్నుల • కొప్పునదిక
సూక్ష్మబుద్ధియు స్థైర్యంబు • శూరతయును
లేనివేకావె! శ్రీరాము • లీలనోలి?

ఉ॥ ఇట్టులదేశదేశముల • నెంచఱకో కడునింద్యమైన వై
వట్టివయేన్నితర్కముల • బాల్కని రామకథార్థతేజముల్

ఆనం—(మందస్మితముగ) నీ యాక్షేపణములన్నియు లోకమువే కాని నీవికావుగదా! అట్లయిన యికనీయిష్టమువచ్చినట్లు కానిమ్ము!

మాన—నాయిష్టమొక్కటేగాదు.

నెట్టనమీారు నేనుడెను • నిర్భగలొక్యపుభావశత్రులై
జెట్టితనాన వాదమును • జేయుఁడి! యిక్కథసార్థమాక్రియన్.

ఆనం—సరే! అట్లెగానిమ్ము.

మాన—ఇందుఁ బూర్వపక్ష భాగమగు నాక్షేపణకోటి నేనేయెత్తుకొనెద.

తో ల్లకథానాయకత్వమున నొప్పు సీతయందుగల మొదటితప్పు భర్త్రనువర్తిత్వము, బహిరంగ సంచరణోద్దేశ్యము. ఇది సతీధర్మమైకూడనా! కూడదా! యనుటకు

శ్లో॥ స్మరగోపమమపి ప్రాప్య వాంఛంతి పురుషాంతరమ్
నార్యస్సర్వాస్స్వభావేన నోచ్యంతే హ్యమలాశయాః ॥
ఇత్యాదిస్మృత్యర్థము చే,

ఉ॥ తననాథుండతి శీల, భాగ్య, కుల, వి • ద్యా, దాన, సౌందర్య, యౌ
వన, ధైర్య, స్థిరభావ, బాహుబల, స • ద్వ్యాపార, సత్త్వాదులం
దున, భూరిప్రభ గాంభీర్య, మదన • స్యన్యోంద వాంఛించుచుం
సునుసై జంబుగ, గానస్త్రీ, హ్యాదసియ • ట్లు స్సమ్మరాదెప్పుడున్.

అందుచేత

గీ. అతిశయోత్కృష్టుడైన • నంతఃపురంబున
నుండనొప్పునట్టు • లుండకున్న
నవ్యమైన యన్య • నైజంపుమననుతోఁ
జూడనగును జూచి • చూరుకొనును.

ఇత్యాది సందర్భములచేత సీత—(అర్థోక్తిలో)

మదనమాలిని—(వారించి) ఇదిగో! సీతవిషయమట్లుంచి నామనవి యొక టాలకించెదరా?

మానస—ఏమది !

మదనమాలిని—గీ॥ అతిశయోత్కృష్టుడైన • నంతఃపురంబున
నుండనొప్పునట్టు • లుండకున్న
నవ్యమైన యన్య • నైజంపుమననుతోఁ
జూడనగును జూచి • చూరుకొనును.

అనియంటిరా ?

మానస—ఔను.

మదనమాలిని—ఆయభిప్రాయోపాయములు రెండు నెప్పుడుఁగూడవు.

మానస—ఎందుచే?

మదనమాలిని—

చం॥ పరపురుషాభిలాష కుల • భామలకెందును గల్గదద్దియుం
దరుణులకుంజనించినను • దప్పకజారుని గూడకుండరీ
ధరణిని జారకాముకుల • దార్ఢ్యము దంపగడంగు టెల్ల యా
సురకరిబట్టికట్టుటయు • సూక్ష్మసరోరుహతంతుసంతతిన్.
[వినో. మద. మాన. చరిత్ర. ప్ర. సం.]

మాన—అట్లనా ?

మదనమాలిని—ఔను.

మ॥ పరలోకాదులకుం భయింపకుచు స • ద్భామామణిశ్రోరత్నముల్
పరుఁ గూడంగఁ దలంపరుఁ జెదరు పోఁ • ప్రఖ్యాతిపోనంచు నీ
ధరణింగామిని జారుఁ బాడఁగడఁగన్ • దామెంతవారైననూ?
పురుషుల్ వారలతప్పుఁ బట్టుగలరే! • పూఁబోండ్లు సంసాధ్యలే !
[వినో. మద. మాన. చరిత్ర]

మాన—ఎట్లు! స్త్రీయందలి సామర్థ్యము సైతము నున్నదా ?

మదనమాలిని—ఓహో! ఏమో మానసమ, గ నాశ్చర్యపడుచున్నా 

శ్లో॥ వినాయంత్రేణ మంత్రేణ • తంత్రేణవినయో నచ
వంచయంతి నరం నార్యః ప్రవ్యాధనమపి క్షణాత్.
[వినో. మద. మాన. చరిత్ర. ప్ర. సం.]

ఇత్యాద్యర్థ ప్రయుక్తంబగు నార్యవాక్యంబులు మనము వినుటలేదా ?

మాన—(విస్మితముగ) ఆహాహా ! మదనమాలినీ !

ఉ. నిక్కువమేవచించితివి • నిర్మలమానసవాట, నందుచే
నెక్కుడుమెచ్చుకొంటిమది • నెంతయు, కాని, త్వదీయజాతి వెం
పెక్కసమర్థతావిషయ • వృత్తులఁగూడగనిన్ను మాత్ర మే
ఫక్కిగనమ్మనొందగిన • పద్ధతినేనికనుండ కిమ్మహిన్.

ఆనం—(వారించి మానసపాలుని స్పృశించుచు) మిత్రమా! ఇదేమిటి?

మాన—ఏమున్నది ?

ఆనం—ఇంకేమున్నది! రామాయణములోఁ బిడుకలాటయును సామ్యముఁ దార్కాణించుచుంటివి.

మాన—(కోపముగ నాతని విదళించి లేచుచు)నీ కేమి తెలియు నట్లుండును.

ఉ. బేలలటన్న స్త్రీలె కదుఁ • బృథ్విని యిట్టి సమర్థులైన చోఁ
గాలవనో కొ పూరుషుల? • కాయమునన్ రుధిరంబుఁ గల్గువాఁ
డేలలి వంచితుండ యెడో ! • యెంతయు రక్తము జచ్చినట్టి వాఁ
డాలలినౌను గాక యది • యంతయు నా యెద సాగివచ్చునే ?

(మదనమాలిని జూచి) రాజ్ఞీ! వినుచుంటివా? (మఱల నానందుతో)
ఆనందా !

ఉ. తప్పక దీనికీగృహామె • స్థాయిగనుండెడు నట్టులింక నే
నెప్పగిదిన్ జరించెదనో • యేర్పడఁ జూడుమ ! యెంతమాత్రమిా
గొప్పలు సాగనిచ్చెదన ? • కోమలి దానిభవిష్యమెంత! నూ!
తప్పలె పూరుషుల్ భువిని! • తన్వియొకర్తుకె గట్టిదానొకో !

మదనమాలిని—(ఖిన్నహృదయయై తనలో)

ఉ॥ అయ్యొ యిదేమికర్మమొకో! • యట్టియెదో యొకమాటమాట చే
నెయ్యదియో వచింపనిది • యేమి! మహోగ్రత కొప్పి యిప్పు డా
నెయ్యవు కాని సైతమును • నీతివిదూరతఁ జేరి దూఱుచున్
జయ్యన నట్టి వై చినను • జంపెడువాని విధాననుండెడిన్.

ఉ. ఏనిక నేమి సేయగల • యెవ్విధి నియ్యధిపాగ్రహోగ్రతన్
మానుపుదాన ! దేననఁగ • మాత్ర మపాత్ర తనాని నానితో!
పోనొక కానిపోనిపనిఁ • బూనితో! నన్నిటు విన్నబుచ్చఁగా
దేనికొకో! విధీ! ననిఁక • దేనఁ బ్రవర్తిలఁ జేసెదోకఁదా !

(అనుచు నిర్విణ్ణయై మానపాలుని జూఁచుచుండును)

మాన—(ఆనందునితో) మిత్రమా !

ఉ. జాలమి కేల ! నా కేదియో • సంశయమయ్యది నేటికిప్పుడీ
బాలవచోమృతామహిమఁ • బాసెను సర్వము నేటనుండి నూ!
యేలలి జాగ్రతన్మెలఁగు • చెట్టులనేనిఁక నుండనొప్పునో
యాలలినుందునింక, యిసి! • యాడుఁదిపూరుషమించుటోర్తునే!

రమ్ము. (అనుచు నానందు చేయిఁ బట్టుకొని గుంజుకపోఁబోవుచుండును)

మదనమాల—(అత్రముగఁ జెలితో) ఇదే మి! (అనుచు వారలఁ జూచును)

చెలి—ఏమోనమ్మా ! (అని పెడమొగముఁబెట్టుచు నొక ప్రక్కకుఁ బోవును)

మదనమాలిని—(బీభత్సహృదయమున తనలో) అయ్యో ! అయ్యో ! నిష్కారణ సంచిత మహోగ్ర కోపంబునఁ బోవుచున్నాఁడే యిపు డేమిచేయనగు ? చివాలున నాతనికడ్డమగుచు మహావినయముగ హృదయేశ్వరా ! ఒక్కమనవి.

మాన—ఇంకనీమనవికి చనువొసంగను. శీఘ్రముగ నావలకుఁ జనుము.

ఆనం—(మానపాలుతో) ఇదిగో నామాటొకటి వినుము.

మాన—(ఆనందుపైపు దృష్టిమరల్చును)

ఆనం—స్వరూప మాత్రాబలలగుమాత్రముననే స్త్రీలను నిర్లక్ష్యతఁజూడఁ జనదు. స్త్రీయనఁగా సర్వసమర్థయగుఁ బ్రకృతిస్వరూప, పంత మూనుచో నెట్టి దట్టనట్టిట్టొనర్పఁగల శక్తిగలట్టి దాడుఁది. ప్రేమించుచో నెంతవిరాగు ననురాగునొనర్చి సరాగమున మెలఁగఁ గలట్టిదాడుఁది. ఇప్పుడైనను నీమదనమాలి నీవిధముగ వేలఁగఁ బ్రార్థించుచున్నప్పుడే యీమె ప్రార్థన నంగీకరించి జాలివహింపుము ? లేదా చెడెదవు. ఎన్నిభంగులను జూచినను నీమదనమాలినీ మహారాజ్ఞి మహావిద్వత్పతివ్రతయని మాత్రము రూఢిగ నమ్ముము. నమ్మక నీచే జేయనగు నదేమియులేదు. సహధర్మిణి యందిట్టి యపనమ్మకముఁ గల్గువాఁడు నిరంతరమును విస్పష్టముగ దుర్వార దుఃఖభాజనుండగుట నిక్కము. పెక్కేల ?

కం. స్త్రీయే సుఖమునుగూర్చును
స్త్రీయే దుఃఖంబునించు • స్త్రీయేయధిక
శ్రేయాశ్రేయంబులనిడు
స్త్రీయే సంసృతినిముంచు • దేల్చు న్మగుడన్.

ఈ విషయమిప్పటికిని మఱువకుము. నేనిదే పోవుచుంటి. పిదప నీయిష్టము. (అనుచు నిష్క్రమించును.)

మాన—(సాలోచనుఁడై యుండును)

మదనమాలిని—(అత్యంతవినయముగ) మనోహరా ! (అనుచు నాతని ముఖము నిరీక్షించుచుండును)

మాన— (ఆలోచనానంతర తిరస్కారముగ) ఈ యానందుని మాటల
కేమి లే? (ప్రక్కనున్న మదనమాలిజూచి)

శా॥ ఓసీ! నీవింకఁ జింతనొందకుము! నీ • వొక్కర్తువే స్త్రీవా! యే
స్త్రీసామర్థ్యము దొడ్డదేయనుచు నీ • దివ్యామలంబౌ మన
స్సే సాక్ష్యంబుగఁ జెప్పి యుండెనుగదా! • చింతిల్లనీ కేటికిఁ?
నాసామర్థ్యము నట్టిదో! కనుమిదో! • తన్వీ! యిదేపోయెదఁ.
(అనుచు నిష్క్రమించును.)

[అంతలో నేపథ్యంబున కవాటబంధనధ్వనికల్గగా మదనమాలిని బెద
రుతో నలుదిక్కులుఁ బరికించుచుండును.]

చెలి—(ఆత్రముగఁ బ్రవేశించుచు) అమ్మా!

శా॥ ఇంకేమున్నది?

మదనమాలిని— యేమి లేయది!

చెలి— కటా! • యింకేమిటే! నూవె! యీ
వంక ద్వారము లెట్లు మూయఁబడెనో!

మదనమాలిని— ద్వారంబులా!

చెలి— యానందు
శ్శంకన్నీ యెడనొంది నీపతియొయీ • షణ్మాత్రముఁ జాలియే
వంకన్ లేకిటు జేసిపోయె మన మె • వ్వట్టింక బందీలమే॥
(అనుచు భీభత్సమునమున జేతులు పిసుకుకొను చుండును)

మదనమాలిని—(భీభత్సముగ) ఆఁ! అంతపనే జరిఁగినా! హా! నిష్కల్మ
ష హృదయనయ్యును నిరంతర కారాగారోపమాంతః పుర్ధగాఁ
గావలసి వచ్చెనా! విధీ! ఏమిది! సత్యశీలనగు నన్ను సమస్తరాజ్ఞీ
లోక ప్రచార నిందోపహతను గావించెదో! హా! హా! హా దైవ
మా! సాటివారలలో నగుబాటులకు హేతువగు నాకీతప్పులేని శిక్ష
నేలసంప్రాప్తింపఁ జేసితివి!

చెలి—(వారించి) అమ్మా! స్వయంకృతాపరాధమునకు దైవమేమి చేయు?

మదనమాలిని— ఆఁ! ఏమి! స్వయంకృతాపరాధమా? (కోపముగ) ఛీ!
నోరుమూయుము! ప్రస్తావసందర్భమున నిజము వక్కాణించు
టపరాధమా?

చెలి—నీనిజమేమనుమ్మా? ఎట్టిపురుషునైనను వంచింపగలట్టి ప్రౌఢత్వ మున్ననే నేనొండు సమర్థుని గాజులు గలగల లాడించుకొనుచు బైటకురావలె. లేనిచో యథాస్థితి ముడుచుకొని మూలఁ బ్రాల్మాలుటయే స్త్రీప్రవృత్తి. అట్టిచో నీవెందు నాటితేటుఁ బ్రౌఢత్వము గలట్టి సమర్థుని బెట్టిదంపుఁ గట్టిండగుఁ బ్రభుముందు నట్టువట్టి బింకంపు టంకానఁ బెట్టాడితివి? అందునే నీకట్టి శాస్తి నొనర్చినాఁడు.

మదనమాలిని—అందుకిది శాస్తియా?

చెలి—ఔను. ఆతఁడు బలేపక్కావనిఁ గావించినాఁడు.

మదనమాలిని—నేనంతకంటెఁ బక్కాపనే కావింపఁగల నెఱుంగుదువా?

చెలి—అట్టితెలివితేటలే యుండుచో నింతవిచారమేల?

మదనమాలిని—నాకట్టి సామర్థ్యము లేకనే యిట్టు విచారించు చుంటి ననుకొంటివా!

చెలి—మఱి దేనికి?

మదనమాలిని—భర్తృవంచనాదోషంపు వెఱపొందుటచే!

చెలి—(సాక్షేపముగ) ఎల్లెల్లు భర్తృవంచనాదోషంపు వెఱపా? ఆవెఱ పెట్లున్నను నిపుడు చేయనగు నావంచనా విధానమేదో కొంచె మెఱింగింపఁగలవా?

మదనమాలిని—ఓసిపిచ్చిదానా! ప్రపంచమున నుత్తమమగుఁ బ్రజ్ఞఁ గల్గువారల కెప్పటి కప్పుడే యొప్పిదమగునెత్తుకెత్తు సిద్ధముగఁ దోచుచుండును. చూచితివా!

సీ॥ ఏనాడునిర్మల • హృదయంబుఁజెలువొంద
మదిఁదోఁచినంతబై • ల్పఱచియుంటి
నానాడునిర్మల • హృదయమే మలినమై
నటులఁదోఁచఁగఁజేయు • దమలనొచు
నేనాడుకర్మ వ • శాన నానిష్కల్మ
షాయితవాక్కురో • షాత్తమయ్యొ
నానాడుకర్మ వి • ధానమే కల్మషం
బైనట్లు తోఁపించు • దసతిఁగాక

గీ॥ యెట్టినాపతి నాయందు • నేమితలఁచె
నట్టి నాపతియే యందు • నమరినటు
హృదయమందుఁ దలంచి వి • భ్రాంతుఁడగుచు
నట్టులొనరింపఁగలదాన • నబలఁగాను.

చెలి—అనఁగా!

మదనమాలిని—(వినిపించుకొనక మానసపాలును ద్దేశించి) మనోహరా! నీయాకృతికి ప్రతికృతిఁజేయు సామర్థ్యము నాకు లేకపోలేదు. ఉన్నను ఎట్లుచేయుదు. నేమనిచేయుదు.

మ॥ పతియెట్బంగి నకృత్యుఁడైనసతి • యైభాసిల్లు నద్దేమి ప
ద్ధతిగా నాతనికృత్యమంతయు నకృ • త్యంబంచు నెంచన్దగున్
సతియేయైన ధవుండు తన్నెటులనీ • వన్మాత్రముల్ బ్రేమవ
ర్జితుఁడై తిట్టినఁ గొట్టినన్ మరియెదేఁ • జేయు న్సహింపన్వలెన్.

చం॥ అని యిటుధర్మశాస్త్రములు • నావురఘోషిలుచుండ నేవిధిన్
బనివడి నీదుకృత్యమును • భావ్యముగాని యకృత్యమంచు న
మ్మనమునఁనెంచనౌ? మఱిక • మార్గమదెయ్యది నాదుబంధము
క్తినిఁగననౌటకిమ్మహిని? • దీనిభరించుట నెట్టు లక్కటా?
(అనుచు విచారముననుండును)

చెలి—(తనలో) ఈమె తొల్లితొల్లిఁ బ్రభాతమేఘాడంబరముం బోలి యేమేమో ప్రగల్భతలాడి తుట్టతుద కిప్పుడు తెలివేదియును గానక చింతిలుచున్నది. (ప్రకాశముగ) అమ్మా! మఱలనేమి కతంబునఁ జింతిలుచున్నావు?

మదనమాలిని—(దీనముగ) ఏమియును స్ఫురించుట లేదే?

చెలి—మఱి నీప్రగల్భతంతయు నారంభ సంరంభమేకాని అత్యంతమగు సంలబ్ధసంరబ్ధముగాదను?

మదనమాలిని—(సవిచారసాలోచనములతో) చెలీ!

చం॥ విధికృత మెట్టులేననుభ • వింపకఁదప్పదు కాన బుద్ధిఁబె
న్నిధినగుదేని నాహృదయ • నీరజనిర్మలతన్గ్రహింపక
వ్యాధిఁబతి నాయెడ స్దలఁచె • వేగము నవ్వ్యాధి సంచరింతు స
త్పథమిసుమంతయు న్విడక • భామలజాణతనావనొప్పచున్.

చెలి—అమ్మా! నీవేమో ప్రతిన విధంబుగఁ బలుకుచుంటి వేకాని నీ భావమేదో బోధపడుటలేదు.

మదనమాలిని—నాభావ మింత మాత్రము నే నీకు బోధపడునా? ఇపుడు నాహృదయమెట్టి కపటనాటక కథారచనోద్యక్తమై యెంత సంరంభముగ నెంత వింతగుఁ జిత్ర విచిత్ర రంగంబులఁ జిత్రించుచున్నదో నీవేమెఱుంగుదువు ?

సీ॥ రతివాంఛఁ జెలరేగి • రతనోయూరతనీఁగి
దేనందు నానంద • మానినొప్పుఁ
గులుకుతోఁ, జెలువుతో • వలులందు వలులొంది
దేనందు నానంద • మానినొప్పుఁ
దనివోవఁ దనువోవు • ఘనతరాలింగ్యత
దేనందు నానంద • మానినొప్పుఁ
గొట్టానఁ గొట్టాడి • బిట్టానఁ జిట్టాడి
దేనందు నానంద • మానినొప్పు
గీ॥ నట్టి సర్వైహికాంక సం • ఘట్టఘట్టి
తొట్టసుఖ సంగ మావాప్తి • నమరుచుండు
జారసంబంధమునకన్న • జగతిమిన్న
మార్గమున్నదే, కామినీ • మణులకెందు॥

చెలి—(విస్మితముగ) అమ్మా! నీమహాపవిత్ర హృదయసాగరంబున నిట్టి యాలోచనా తరంగంబు లభంగ భంగురంబులుగాఁ బొంగి పొరలుచున్నవేమి? ఐనను నీకామార్గ మెట్టు లభ్యము ?

మదనమాలిని—ఓసి పిచ్చిదానా !

సీ॥ ఏసర్వసుఖముల • కెలనాస్పదంబౌచు
నేవృత్తి రహిఁజెందు • నేరికైన
నేసర్వపుణ్యౌఘ • లీసమాహ్వాయ మొప్పి
యొది దివి ముఖ్యమా • నేరికైన
నేసర్వశృతిసార • మై సౌఖ్యసాగరం
బై యేది స్తుత్యమా • నేరికైన

నేసర్వవిధమనో • ల్లాసినీత్వతఁ జెంది
చేదిడు నానంద • మేరికైన
గీ॥ నట్టి వ్యభిచార జన్యమే • యవ్యయులగు
నవ్య శృంగార నాయకీ • నాయకులకు
శక్యమే నుతింపఁగ నదే • సంతతంబు
స్వీయపతియందుఁ గనిసంత • సించుదాన॥

చలి—(సాక్షేపముగ) ఓసి చాదస్తురాలా! స్వీయపతి యందిప్పుడు కనుచున్న వ్యభిచారజన్యంబగు సంతసంబుకన్న వేఱుగాఁ గనదగున దేమున్నది?

మదనమాలిని—ఓసీ! నీవే చాదస్తురాండ్రలలో కెల్లఁ బ్రథమురాలవు.

చలి—ఎట్లు?

మదనమాలిని—ఇంతవరకును నీకసలు వ్యభిచార శబ్దార్థమేదో తెలియదు

చెలి—నీవు చెప్పుము?

మదనమాలిని—స్వీయపతియందు జన్యమగు సంతసము ఆభార్యలగు వారలకు శాస్త్రాచార ధర్మంబుకాని, వ్యభిచారజన్యంబు కాదు. వ్యభిచారశబ్ద జన్యంబగు నర్థము అంకు. అట్టియర్థ మన్యాభిసారికల యందొప్పు, నేనుమాత్ర మట్లుగాక స్వీయాభిసారికనై నాసతీత్వ మున కెట్టి లోటుఁ గలిగింపకనే తదర్థమనుభవింప నిశ్చయించితి.

చెలి—బాగ నేయున్నది కాని యిది పొసఁగుటెట్లు?

మదనమాలిని—దీని విధాన ప్రకరణమంతయు నామనను నందప్పుడే విధించియుంచితి.

చలి—ఏమని?

మదనమాలిని—నావర్తమాన వృత్తాంతమును నానిశ్చయంపు భావివిధానమును నెట్టన నాచెల్లెలగు మదనవతికి, నాభర్త యొటుకనే రొయికపువ్వకందుక గర్భిత లేఖ ముఖంబునఁ దెలియఁజేసెద. అందుమీఁద మదనవతి పురుషవేషధారిణియై యీవసుమానస నగరముఁ బ్రవేశించి సత్రవర్తనమున నానాథుని చెలిమిగాంచి, తదనుగ్రహంబున యీసౌధాంతర సామీప్య నిష్కుటంబు

నొక నివాస యోగ్యంబగు గృహముఁ దనకై నిర్మించుకొని యందుండి భూగర్భిత రహస్యద్వార మొండు నిట నేర్పరచును. పిదప నెట్టెట్టి చాతుర్యక్రియ లొనర్పుచుండునో, మున్ముందు నీవే చూచి గ్రహింపఁగలవు.

చెలి—(సంభ్రమాశ్చర్యములతో) అమ్మ! అమ్మ! ఎంతగడుసుదాన వమ్మ! నే నేమోయనుకొంటిఁ గాని యెంతలో నెంతయూహా పోహములుఁ గలజాణవైతివి?

ఆ॥ మొదట మొదటనెంత • ముగుదుగా జెలఁగితో
యంతకన్న జాణ • వైతివిపుడు
బాలవైన విబుధ • జాలమందున నీదు
ప్రతిభయెల్ల యొప్పుచు • రాణగాంచు॥

మదనమాలిని—ఐనఛో నాయూహ నీకుచాలగా నచ్చినదే కదటే?

చెలి—(ఆతురముగ) నచ్చినదిగాని. నీవసలు చలచిత్తవు. అందుచేత నీ విప్పుడింతగా యూహించి చూపింప నిశ్చయించిన నీచాతుర్య పోహణకంతయు సార్థకక్రియఁజూపెట్టుదో లేదో యని సంశయముగ నున్నది. ఇదిగో నీహస్త మీహస్తమందుఁ జేర్చి నే నీకార్యముఁ దప్ప కొనర్చెదనని ప్రామాణికమొనర్చిన గాని నీయిట్టి కృతనిశ్చయమును నేను నమ్మఁజాల.

మదనమాలిని—(సుస్మితముగ) ఓసిపిచ్చిదానా! అట్లే ప్రామాణిక మొనర్చెద నిదిగో పట్టుము. (అనుచు దానిచేతులోఁ దనచేయినిడి)

ఉ॥ ఎన్నివిధాలను న్బహుత • రేంగిత రంగిత రంజితాన, నా
చిన్నియనంగుఁ జెల్లికిఁక • జిత్రత జిత్రితవుం బత్రచే
నున్న కథాంశమెల్లఁ గడు • నున్న నవీన విధానమెల్లయుః
గ్రన్ననఁ జేర్చుదాన విని • కన్నలు మిన్నగనెన్న నన్నదః॥

ఇదియెల్లను సత్యము. సత్యము. సత్యము.

(అనునంతలో నవనికజారును)

ఇది ద్వితీయాంకము.

— ✱ —



# సతి శృంగారవతి.

## తృతీయాంకము.



ప్రదేశము—మానపాలునికోర్టు.

[మానపాలుఁడును మంత్రియు నానందుఁడును శాస్త్రియు నుచితపద్ధతి సభ నలంకరించియుందురు.]

మాన—(మంత్రినిజూచి) నీకీదినము గతదినసంబంధపు వ్యవహారశేష మేమియునుండదా?

మంత్రి—ప్రభూ! ఎంతమాటయనుచుంటివి?

మాన—(విస్మయముగ) అదేమి?

మంత్రి—మహీపాలతిలకమా! నీకీవిస్మయమేల?

గీ॥ పరధన పరదారాసక్త • నిరతు లెవని
రాజ్యమున నుందురో యట్టి • రాజుసభకు
వింతవింతలౌ తగవులుం • దంతఁ బెరిఁగి
వచ్చుచుండు నెప్పుడుఁ దీఱు • పాటులేక.

అంతియేగాని మనరాజ్యమునందట్టి వెవ్వియు నింతవరకును జరిఁగి యుండలేదు. కాలవైపరీత్యముగల్గుచో నింకముందేమో చెప్పఁజాలను.

శాస్త్రి—(వారించి) ఎన్నికాలవైపరీత్యములు గల్గిన నిఁకముందేయేమి యీభూపాలుర చండశాసిత ధర్మపాలన మందట్టి విచార మనవసరము. ఆనందా! నీయభిప్రాయమేమి? (అనునంతలో)

(రంగమున నొకపెట్టెతో దొంగ, భటుఁడుఁ ప్రవేశము)

భటు—(దొంగనునెట్టుచు) గాడ్దె! నోర్మూసుకోని ప్రభువుగా రొద్దకుఁ బద! (దొంగనెత్తిపైపెట్టె క్రిందఁ బడఁగా వానిని కొట్టుచు) ముం దుదీసి తినె తిన బెట్టుకో.

దొంగ—(పెట్టె నెత్తుకొనుచు) ఏమోయి మహాదర్పం జూపిస్తుండావే! నేనెట్లయిన నా రాజు పాదాల్మీదబడి తప్పించుకుంటా. అప్పుడేమిం చేస్తావోయ్?

భటు—ఇంక నీవిలో కాన్ని తప్పించుకోవాల్సిందే!

దొంగ—అంటె?

భటు—ఓ రెధవా! చచ్చి మన్ను కావడంరా!

దొంగ—మన్ను కావడం అంటె? నన్ను చంపి పూడ్చేస్తాడేంటి?

భటు—పూడ్చేయడూ! నిల్వా నురితీయిస్తాడు.

దొంగ—నిన్నాకి నన్నా?

భటు—ఆ! (ఊడ్చి చెంపపై కొట్టుచు) అంత కొవ్వెక్కిందంట్రా!

దొంగ—(క్రిందబడిపోవుచు నుచ్చస్వరంబున) ఓరినీతాడుదెగో!

భటు—ఏదీ మళ్ళ నోరెత్తు? (అనుచు నోడినుండి కత్తి దీయుచుండును)

దొంగ—ఇదుగో మళ్ళకొట్టావంటే మర్యాద దక్కదు జాగ్రత!

భటు—ఏంచేస్తావోయి?

దొంగ—ఏల్నోరికి చెప్తా.

భటు—ఏంచెప్తావ్?

దొంగ—నీభై ప్యాని కేల్నోరేకా చెప్పాలా! నీగుడ్లు పీకించటానాకు మాత్తాకు చెప్తే చాల్దూ!

భటు—(సాలోచనముగా) ఏందీమాట! ఏల్నోరంటె ఏల్నోర్సరె. నా గుడ్లు పీకించే యా గుమాస్తా యెవరు? (అనుచు దనలో నాలోచన మభినయించుచుండును)

దొంగ—(ఉలుకుపాటున తనలో) అరరే ఎంతపొరపాట్పడ్తి? ఆమణి మంతగుమాత్తాగారెంతో బతింవిలాడి బతింవిలాడి ఎన్నో బుద్దుల్చెప్పి యీపెట్టిస్తే సరె ఆయన్చెప్పినట్టె దొంగాల్నే ఎట్లా నటించాల్నో అట్లా యింతవరకూ తప్పకుండా నటించా. బాగా నేవుంది. ఆఖరుకు ఈడకొచ్చేయాల్కి అగుమత్తానుండానే! (నోరుమూసుకొనుచు) ఇంకానయం. గాచారం మంచిది. ఆయేల్నోరి పేరింకా గ్యాపకం రాలె. వచ్చినట్టయితే కొంపమున్గేట్టుగా ఆయన్పేరూ బైటపెట్టేవాణ్ణే. ఎప్పుడేస్చిన దొంగితనం

ఈదొంగతనం. ఏందో కాలకర్మవశాన కడుపులోకి గంజిలేక తిరిగేవాణ్ణి. అట్లాగ తిరక్క ఈఅడ్డం వైనవాళ్ళచేతుల్లో తన్నుల్తింటాని కొవ్వుకొన్న దొంగతనంగాని ఏంవుందిమటీ. ఒకాల నిజంగా చెయ్యాలనుకుంటేమాత్రం దానిలోవుండే మామ్మరాస్యాలందరికీ తెలిసేదుస్తై? దాన్దుంపతెగలే పాడుదొంగతనం. ఈకాసేపెట్లాగో వోర్చుకుంటినా నాదైద్రం అంతా తీరిందన్నమాటే ఆగుమాత్తా చెప్పిందబద్దాం తుందా? పోతేమాత్రంనాకేం, ఆమణిమంతచేటి కాళ్లమీద సపడతా. ఆఁ మర్చేపొయ్యా ఆమణిమంతిచేటిగారిక్కూసి కొస్తారని ఆగుమాత్తాగారే చెప్పారుగా ఇంకేం.

భటు—(చప్పరించుచు) ఊఁ హూఁ ఈయొధవలకు సంఘూలులేవు. పాడులేవు. ఉంటేమాత్రం గుమాస్తా యెందుకు? ఇదంతా టలాయించటానికెత్నం. అంతే, (ప్ర) ఓరీ నాగుడ్లు ఊడబీకే నీగుమాస్తా యెవరో చెప్తావా? పళ్లూడదన్న మంటావా? (అనుచుఁ దన్నబోవును)

దొంగ—బాబూ! దణ్ణంబెడ్తా తన్నకు తన్నకు.

భటు—మఱి తిన్నంగాఁ జెప్పు.

దొంగ—(తిరస్కారముగా) ఏందోయి నీకు చెప్పేది?

భటు—(జనాంతికముగ) అయింది. (వానితో) ఓరీ! ఇఖాపెట్టెత్తుకో.

దొంగ—నేనెత్తుకోలేను.

భటు—నేనెత్తెనఁ బట్టుకో!

దొంగ—ఎవఁడు మోస్తాఁడు?

భటు—ఆఁ అయిందే! ఇఖ నిన్ను నమ్మరాదు, ఇయుగోపట్టు. (అనుచు నాడినుండి సంకెళ్లు దీయును)

దొంగ—(ఆశ్చర్యముగ) అదేంది!

భటు—ఏందో లేవట్టు. (వాని చేతులకుఁ దగిలించును)

దొంగ—సంకెళ్ళంటే ఇవేన్టయ్యా!

భటు—(పెట్టెను వానినడుముకు బిగించి) ఆఁ ఇవేలేయిఖపద.

దొంగ—మఱైతే దొంగనుబట్టుకోడంతోటే తగిలించాలంటారుగా.

భటు—నాకూ దొరకక దొరకక నేఁటి కాలానికి దొంగదొరికితే కొత్త బిచ్చగాడిప్రొద్దైంది. పద! పద! (వానినెట్టు నంతలోఁ బ్రభు సన్నిధిఁ జేరుదురు)

ఆనం—(శాస్త్రినిజూచుచు) శాస్త్రిలుగారూ! అటుఁజూడుండు!

శాస్త్రి—(దొంగనుజూచి) ఇదేమి?

మంత్రి—(భటునిజూచి) ఓరీ! వీఁడెవఁడు! యీపెట్టెయేమి?

భటు—(తలవొంగ్గుచు) మహీపాలవరేణ్యులకు జోహారు. వీఁడొక దొంగండి.

మంత్రి—వీనినెక్కడ పట్టుకుంటివి?

భటు—పట్ణంబైట గుట్టలచాటు నొఖపెద్ద గొయ్యిదీసి ఆగోతిలో ఈడీ పెట్టెను బూడ్చుతూంటె చప్పునాడఁ బట్టుకుంటి.

మంత్రి—నీవదెట్లు కన్పెట్టఁగల్గితివి?

భటు—అప్పుడు నాకాడ ఫారాతిర్గేవంతు.

మంత్రి—అంతమాత్రముననే గుట్టలచాటునుండువాని నెట్లు గన్పెట్టఁగల్గితివి?

భటు—ఈడాగుట్టలచాటునుండి తనపనేరైనా సూస్తారని కాంవాలా అప్పుడప్పుడు బైటకువచ్చి తొంగితొంగి సూస్తూ మళ్ళా లోపల కెళ్ళ మొదలెట్టాడు. అదిచూచి అఁహాఁ ఇదేందో సందర్భంగా వుందే అని చప్పునఁబోయి పట్టుకుంటి.

దొంగ—(పైనఁజూచుచుఁ గాలాడించుచు కూనరాగములు తీయుచుందును.)

మంత్రి—వీఁడా తొంగిచూచునప్పుడు నిన్నుచూడలేదా?

భటు—మాచే కాంవాలా, చప్పప్పున యీపెట్టాగోతిలోఁ బడేసి గంద్రగోళంగా మట్టితోస్తూన్నాఁడు. అంతలోనే నేనమాంతంగాఁబోయి గబాని పట్టుకుంటి.

మంత్రి—వీఁడీ పెట్టెనట్లు పూడ్చుటకుఁగల కారణమేమో మొదట నెమ్మదిగా నడిగితివా?

భటు—అడిగితేయేం. యెంతడిగినా సమాధానంచెప్పక నన్నువదలించు

కొని వెళ్ళాలని యెంతో పెనుగులాడటం మొదలెట్టాడు. ఇంతకు బండాముండాకొడుకును గన్కపట్టిన పట్టువదలకుండా తిన్నంగా యీడ్చుకొచ్చా.

మాన—(వారించి మంత్రితో) ఇఁకచాలును దొంగను విచారింపుము.

మంత్రి—చిత్తము (భటునితో) ఓరీ! దొంగ నిటునభిముఖుఁ జేయుము.

భటు—చిత్తము. (దొంగనుజూచి) ఓయబ్బో! వీఁడు సంగీతాలు దీస్తున్నాడండోయి.

మాన—సంగీతాలు? (గద్దింపుగ దొంగతో) ఏయి ఇటుతిన్నఁగజూచి యడుగుదానికి సమాధానముఁ జెప్పుము.

దొంగ—(త్రుళ్ళిపాటున దిక్కులుచూచుచు) వోందిది?

మంత్రి—(దొంగతో) ఓరీ! ఈభటుఁడు చెప్పుచున్నదంతయు వినియుంటివా?

దొంగ—ఏల్నోరికి దండాలండీ!

మంత్రి—నీ దండాలటుంచి నేనడుఁగుదానికి ముందు సమాధానముఁ జెప్పుము.

దొంగ—ఏం సమాధానమో సెలవియ్యండి.

మంత్రి—ఆసొత్తు నీచే నపహరింపఁబడినదని మాభటుఁడు చెప్పుచున్నాఁడు. అందు కంగీకరించెదవా?

దొంగ—(తనలో) ఏంవిటో యీ పాడుమాటలు నాకు తొంద్రగా అర్థమేకావు. (అనుచుఁ దలగోకుకొనుచుండును.)

మంత్రి—త్వరగాఁ జెపుము.

దొంగ—(తనలో) ఇదెక్కడి తొందరోయి పాడుతొంద్ర

మంత్రి—ఏమిరా? ఒప్పుకుంటివా ?

దొంగ—(తనలో) ఇదేడదో మాయపీడ తొందరొచ్చిందె (ప్ర) ఏల్నోరల్లా తొందర్చేస్తా రెల్లాంసి. ఏల్నోర్మందెల్లా చెప్పాల్నో ఎట్లా చెప్పాల్నో ఆపద్దావతంతా మర్చేపోయ్యానా? మళ్ళా గ్యాపకం తెచ్చుకోని చెప్పాల్నా మరొద్దండీ?

మాన—(వారించి మంత్రితో) ఇఁక వీనిఁ బ్రశ్నించుట కట్టిపెట్టి ఆ పెట్టెయందుఁగల సొత్తు ఎవరికిసంబంధించినదో విమర్శింపుము.

మంత్రి—చిత్తము (భటునిజూచి) ఓరీ! ఆపెట్టె నిటుదెచ్చివిడఁగొట్టుము.

భటు—చిత్తము. (అట్లుచేయును)

మంత్రి—(లేచిపెట్టెను సమీపించిచూచి) మహీపాల వరేణ్యా! ఇవేవో రొక్క రాజరమణునింటఁగల రత్నములని తోఁచుచున్నది.

మాన—(విస్మితముగ లేచి సమీపించుచు) అట్లనా?

మంత్రి—(యొకరత్నముఁదీసి మానపాలునకిచ్చుచు) ఇటుచూడుఁడు?

మాన—(అందుకొని పరిశీలించుచు సంతసముగ) ఆహాహా! ఎంత విలువ గల రత్నంబులివ్వి?

మంత్రి—(పరిశీలించుచు నందుఁగలచీటిఁజూచి) "రత్నవర్తకమణిమంత" (అని చదువుచుండును)

శాస్త్రి—(మంత్రినిజూచి) కొంపఁదీసి రత్నవర్తకమణిమంత యున్నాడ్నారేమండోయి?

మంత్రి—అట్టిపేరుతోఁ బ్రబిరుదుఁ ..కుఁ దానికి చీట్లంటింపఁబడి యున్నవి.

శాస్త్రి—(ఆనందుఁజూచి) ఆనందా! ఇఁకఁ గొంప మునిగిందన్నమాటే.

ఆనం—(వారించుచు) త్వరపడకు.

శాస్త్రి—(క్రమక్రమక్రోధాభివృద్ధుఁడగుచు) ఏమిత్వరపడకు?
ఆమహానుభావుని రత్నములపహరించిన యీదొంగను మెత్తఁగాఁ జితకపొడవక వీరుగాఁబట్టి యింకా మొదలకూరుకున్నారు. (లేచి రౌద్రమున పండ్లు పటపటలాడఁగా దొంగపైఁబడుచు) ఓరీ ఛండాలుఁడా నిన్ను పిండిపిండిగా నలగఁబొడిచినను పాపమున్నదా?

దొంగ—(భయమున నేలఁగొత్తి) ఈయెన్నవ్రో బాబో? (అనుచుఁ బాఱిపోఁబోఁగా భటుఁడు పట్టుకొనును).

ఆనం—(చప్పున లేచి శాస్త్రిని వారించుచు) ఇదేమిటయ్యా? ఇచ్చట నింతమందియుండఁగా నీకొకనికే యింతకోపమేల?

శాస్త్రి—(ఆనందు విదళించుకొనుచు) ఓరీ! విశ్వాసఘాతకుఁడా! నిన్న గాక మొన్ననేకదా నీవేమో వేదాంతార్థములు బాగుగాఁ

జెప్పెడివాడవని యీముప్పేటల రత్నహారము నీకొఱకుగానఁ బెట్టినది! ఇంతలోనే మఱచితివా?

ఆనం—మఱువలేదు లేరమ్మా! (ఆతనిచేయిఁబట్టుకొని మెల్లఁగా నాసనముపైఁ జేరును.)

మాన—(మంత్రినిజూచి) ఈయపహరింపఁబడిన సొత్తుగలవారు వీరల చక్కని యెఱుక నేయున్నట్లు స్పష్టమగుచున్నదిసుమా? (అనుచు నాసీనుఁడగును)

మంత్రి—ఔను. (అనుచు నాసీనుఁడై యానందుఁజూచి) ఆర్యా! ఈచోరాపహృతము గుఱించి శాస్త్రిగారికి తత్తఱపాటేల?

ఆనం—అమాత్యశేఖరా! మీరారత్నవర్తక మణిమంతుఁగూర్చి యిదివరలో వినియుందురో లేదో కాని యిప్పటికి రమారమి యైదారు మాసములనుండి మనపట్టణమున రత్నవ్యాపారము సేయుచు బీదసాదులఁ గనికరించుచుఁ బ్రజలచే మణిమణిమంతుఁడు మిగుల భాగ్యవంతుఁడనియు, ధర్మశీలుఁడనియుఁ బుణ్యాత్ముఁడనియు మఱియుఁ బలుతెఱంగులఁ బ్రఖ్యాతిఁగాంచుచున్నాఁడు. ఈతనికింకను నన్యదేశంబుల వ్యాపారస్థలంబులున్నవట. ఉండినను,

శా॥ విద్వత్పూజక రత్నవర్తక మహా • విద్యుద్యశః ప్రాభవో
ద్విద్వద్వర్యత సర్వభూతిసమ సం • ప్రేమార్ద్రచిత్తోన్నతిన్
విద్వన్మండల మాచునొప్పెడు భవ • త్ప్రొధ్వందునేచేరి స
ద్విద్వద్వర్యులఁ గారవించు కతనన్ • విద్వాంస బంధుండయెన్ ॥

అందుచే నాతనికష్టమే మాకష్టముగాఁ బరిగణింపఁబడుచున్నది.

మంత్రి—(శిరము కంపించుచు) ఓహో!

మాన—(మంత్రిఁజూచి) ఇఁకనాలస్యముసేయక ఆమణిమంతుసభకు రానాజ్ఞాపత్రముఁ బంపుము.

మంత్రి—చిత్తము. (ఆనందుఁజూచి) ఆతనినివాస మెచ్చట?

ఆనం—మీయాజ్ఞాపత్ర మొకభటునకిడి పంపుడు. మనభటులలో నైతమాతని నివాసము నాతనియుదంతము నెఱుంగని వారుండరు.

మంత్రి—(భటునిజూచి) ఏమిరా? నీవాతని నివాసమెఱుంగుదువా?

భటు—ఎఱుంగుదును, ఈప్రక్క మూడోవీధిలోనే యాతనినివాసము.

మంత్రి—సరె. ఈ యాజ్ఞాపత్రమాతనికిడి సభకు శీఘ్రముముగ నాతని బ్రవేశ పెట్టుము. (అనుచు నాజ్ఞాపత్రమొసంగును)

భటు—చిత్తము. (ఆజ్ఞాపత్రమందుకొని నిష్క్రమించును)

మాన—(మంత్రినిజూచి) ఎప్పుడాతనిదర్శింతునా? యని హృదయము మిగులఁ ద్వరపడుచున్నదిసుమా?

మంత్రి—ఈచోరాపహృతముఁగూర్చి యాతనిచే నెట్టి విన్నపపత్రము మనయొద్దకు రాకుండుటచూడఁగా నాకు మిక్కిలాశ్చర్యమగు చున్నది.

శాస్త్రి—మీ కాశ్చర్య మగుచున్నదేమోకాని మా కేమియు లేదు.

మంత్రి—ఎందుచే?

శాస్త్రి—ఇట్టి ముష్టిరత్నములా భూలోక కుబేరునకు ఆకలియుగ కర్ణునకు ఒకలెక్కా?

(అంతలో భటునితో మణిమంతుఁడు ప్రవేశము)

దొంగ—(మణిమంతునిజూచి యత్యానందమునఁ దనలో) అమ్మయ్యా రానేవచ్చినాడమ్మా! (ప్ర) ఏమండోయి! ఈళ్ళంతా నంచంపుక తింటున్నారు. ఏల్నోరికి దండాలుదండాలు రచ్చించండి రచ్చించండి. (మణిమంతుని పాదములపైఁబడును)

మణి—(భటునిజూచి) ఇతఁడేనా చోరుఁడు?

భటు—చిత్తమండి

మణి—(దొంగతో) ఓరీ! నీకువచ్చిన భయమేమియులేదు. అవలకుఁ బొమ్ము.

మాన—(ఆనందముతో) ఆవచ్చువాఁడే మణిమంతుఁడనువాడు కాబోలు?

ఆనం—(శిరఃకంపముఁ జేయుచుండఁగా)

శాస్త్రి—(ఆత్రముగ) ఔనౌను.

మాన—(జనాంతికముగ) ఆహా! ఏమాతని శాంతరసవచనములు?

మంత్రి—(భటునిజూచి) వీరేనా మణిమంతశ్రేష్ఠియనువారు.

భటు—ఔ నీమహానుభావులేనండి.

మణి—(మహావినయముగ) సభాసదులందఱకును వందనములు. (అను చుఁ దలయొగ్గును)

మాన—(సంతసముగఁదనలో) ఆహా! ఏమావినయ రస ప్రదర్శనము!
చ॥ ధనికునియందుఁ బండితుని • దాపు మహాబలవంతుపొంత స
ద్వినయము స్వర్ణసౌథమున • దింపిన రత్నపుఁదోరణంబలె౯
ఘనమగు సత్ప్రకాశమునఁ • గ్రాలుచునంగను వీనియందె నేఁ
గనవయె సర్వరీతులను • త్ప్రాస్థలి వీనికి వీఁడెయీడగు౯.
మంత్రి—మణిమంత శ్రేష్ఠీ! నీవాయాసన మలంకరింపుము.
మణి—చిత్తము. (అనుచు నాసీనుఁడగును)
మంత్రి—(మణిమంతుఁజూచి) రత్నవర్తక మణిమంతుఁడననీవేనా!
మణి—ఆలాగుననే పిల్చుచుందురు.
మంత్రి—నీవీ నగరమున రత్నవ్యాపారము సేయుచుంటివా?
మణి—చిత్తము.
మంత్రి—ఎంత విలువవఱకు?
మణి—ఏదో ప్రస్తుతమిచ్చటఁ గొంతవఱకే.
మంత్రి—ఆకొంతకే పరిమితియెంత?
మణి—కొంతయే యేమిలెండు? ఇచ్చటను నేఁబదివేలకోట్ల రూప్యముల
విలువకు తక్కువలేకనే వ్యాపారము జరుగుచున్నది. కానిందు
అంతవఱకు నష్టము రాకుండా చక్కగా జరుగుచున్నమీద చూడ
వచ్చునని ప్రస్తుత మంతటితో విరమించుకొంటి.
మంత్రి—(ఆశ్చర్యముగ మానపాలుఁజూచి) చూచితిరా! ఈతఁడింత
విలువవఱకు వ్యాపారము సేయుచు సామాన్యునివలె నటించు
చున్నాఁడు. ఇదంతయు నిజమా! అనృతమా? యనిసైతము సం
దియమునఁ గల్గుచున్నది.
మానః—(వారించి)
మ. అవునోయీ! యితనొక్క మోసమున దెసూ?•యాశ్చర్యముప్పొంగఁగా
గవలుంబెక్కిన పైడిబొమ్మ? యనఁగా•రాణించు స్త్రీచిహ్నముల్
నవలో? నవ్యపుసుందరీయగు మరు • న్నారీమణీయొక్కశ్వ
శ్రువా? యంచాసిరిసక్కల్గొప్పె నితఁడె • ట్లున్నాని సామాన్యుఁడే!
మంత్రి—ఔను. ఇతఁడింత విలువవఱకు వ్యాపారముసేయుట నిశ్చయమే
కావచ్చును. కాని ఇంత విలువవఱకు వ్యాపారముసేయు నితండు

తగిన పరివారముతోఁ గూడుకొని జాగ్రతతో మెలంగక మనరా జ్యమునకెన్నఁడు లేని యపకీర్తిఁ దెచ్చుటకుఁ గారణమగుచున్నాఁడు. అందుచే శిక్షాస్మృతి చట్టముననుసరించి యితఁడు శిక్షకుఁ బాత్రుఁడును ఇప్పటినుండి మనసహాయమువడసి మనకుఁ గప్పముఁ గట్టవలసినవాఁడునై యుండును.

మాన—శిక్షాస్మృతి చట్టమెట్లున్నను మనము వినికనుచున్న యీతని సన్నడవడికనుబట్టి చూడఁగా శిక్షకేమాత్రముఁ బాత్రుఁడుకాఁడు.

మంత్రి—(మణిమంతునిజూచి) నీపట్నములో నింకనెన్ని దినంబులుందువు?

మణి—అడుఁగుచుంటిరికాన చెప్పుచున్నాను వినుఁడు. నాకిచట వ్యాపారము చక్కగా జఱుగుచునందు మిక్కిలి లాభమే కన్పట్టుచున్నది. వర్తకమర్మ మొకరితోఁ జెప్పరానిదేయైనను

చం. మనుజుఁడు ప్రాణరక్షణపుఁ • బట్టుననొండె మఱెట్టిపట్టునన్
నినువుగఁ బొంకులాడినను • నిష్కృతియుండు ధరామరప్రభూ
జనములయందు సాధువుల • సన్నిధి వెండియు దేవళంబులం
దున నన్నృతంబులాడు ఖలు • దుర్భరనారకముక్తి యున్నదే!

అందుచే నిక్కమే వక్కాణించుచుంటి వ్యాపారవిషయ మాలాగునుండగా నాకిచ్చటనుండు దినంబులన్నియు బండితగోష్ఠిచే నిండు సంతోషపూరితంబులగుచున్నవి. ఇంతకన్న నాకు కావలసిన దేమున్నది.

గీ॥ అఖిలశాస్త్రపురాణేతి • హాసయుక్త
మైన పండితగోష్ఠిక • న్యంబుడంబు
మీఁటి సంతసంబిడనున్నె • మేదినందు
నెట్టి మనుజునకైన నె • వ్వట్టునైన.

ఐనను చోరాపహృతముగాని, ఇంకనెట్టి సంకటముగాని తటస్థించకుండునట్లు నామూలధనమును అందుతో నాధర్మపత్నిని నివాసముంచుటకు సర్వజనాభేద్యంబగుఁ బ్రభువుగారి కోటయందే మూలనైనను గొంత ప్రదేశముఁ జూపుచో నచ్చట నొకగృహము నిర్మించుకొని యెన్నిదినంబులైనను నిశ్చయముగాఁ గాపురముందు. నీకార్యమంతయుఁ బ్రభువుగారి యౌదార్యమునందు మాదంపతుల యదృష్టమందు నున్నది.

మంత్రి—ఔను. ఈవిషయముఁ బ్రభువుగారే యోచించి చెప్పవలె.



# సతీ శృంగారవతి.

## పంచమాంకము.

(ప్రదేశము మదనమాలిని యంతఃపురము)

మాన—(ప్రవేసించుచు) ఆహా! ఆసౌందర్యమాలిని యొనర్చు శృంగార మేమి శృంగారము! నిజముగా దాసి శృంగార దేవియనియే తలంప వలయు, ఔరా!

సీ॥ మఱచెదమన్నను • మఱువశక్యంబౌనె?
దేన నాశృంగార • దేవినెపుడు
దాని సౌందర్యంబు • దానిచాతుర్యంబు
దాని యొయ్యారంబు • దాని హాయలు
దాని నవ్యవిధాన • గాన మాధుర్యంబు
దాని లేనగుమోము • దాని యుక్తి
దాని జాణతనంబు • దాని వాఙ్మధురత
దాని సంగమజని • తానురక్తి
గీ॥ ప్రతిఫలించుచు హృదయద • ర్పణమునందుఁ
గనులు మూసిన దెరచినఁ • గానిపించు
మగుడ నేనాటికోగదా • మగువరాక
యంతదనుక నెట్టులప్రైచి • యలరువాడ?
(సాలోచనముగ) ఛీ ఛీ యెంతపొరబడుచుంటి?

గీ॥ వహ్ని సాక్షిగ గైకొనఁ • బడిన దేదొ
యదియె సుస్థిరంబుగఁ జెంత • నలరుఁగాని
యొకని పాణిగృహీతి వే • రొకని చెంత
నెటుల సుస్థిరంబుగనుండు • తెసగు భువిని.

ఉ॥ ఎంతటి జాణయేని మఱి • యెంతటి చక్కని చుక్కయేని యిం
కెంతటి వశ్యయై వయసు • నేర్పడు సర్వమనోప్సితంబు లిం
తింతనరాక దీర్చెడు న • దేని యు ఘోషితభర్తయైన యా
కాంతరతంబు సుస్థిరతఁ • గాంచుట యెట్లగు నన్య పూరుషుల్.

(కొంచె మూరకుండి) అరరె! యెంతపొరబడితి! పరదారాసంగమంబు మహాపాతకమనికదా వేదశాస్త్రములు ఘోషిల్లుట? అట్టియర్థము నెఱింగియు నిట్టిదుష్కృత్యమునకే పాలుబడితిగదా? ఛీ ఛీ ఇంక నేందుకీజన్మంబుఁగాల్పనా? అయ్యయ్యో! నాసర్వార్థగ్రాహ్యతయంతయు నేమట్టిపాలయ్యె. నానిష్కల్మషప్రకాశిత మహాసుస్థిరత్వచిత్తమే ఘోరాటవీ మధ్య దగ్ధమయ్యె. అయ్యో! నానీతి యే యేటఁగలసె. నా జ్ఞానప్రదీపిక యే మూల నాఱె. ఛీ ఛీ ఛీ నాచదివిన చదువులన్నియు వ్యర్థములైనవి. క్షుద్రమును బాపమును నరకప్రాప్యమునగు బరదారాసంగమం బొనరించిన కలుషాత్మున కెచ్చట ప్రాయశ్చిత్తవిధి శాసింపబడియుండె. లేదు లేదు. ఈ పరదారాసాంగత్యమంతటను దుఃసాధ్యమైనదే. దీనికి ప్రాయశ్చిత్తమెందును లేదు. ఇట్టి దుష్కృత్యాచరణపిశాచమే వాని కావేశించుచున్నదో ఆవాని ఆ యావేశితపిశాచకృత మహాపాపము కటకటా! వానిని సప్రాణునిగఁ దైలభాండమున నునిచి భగభగమండు గార్చిచ్చుచే జ్వలింపబడు గాఢాంధకారబంధుర మహారణ్యమధ్యంబునందుఁ దుకతుక నుడికించినను శమించునా. దైవమా! ఇట్టి మహాపాపభూయిష్ఠంబగు వృత్తియందే సమస్తజనంబులకు నింత లాలసగూర్చు దేల? నీచేసృజింపఁబడినీచే బోషింపఁబడుచునీచే లయింపఁబడబోవు నీసర్వమానవులు నీబిడ్డలుగారా? పాపమనియుఁ బుణ్యమనియుఁ బ్రతివిషయంబు నందును ద్వంద్వము గూర్చి, జనులందరఁగలిమి లేములఁదేల్చి కష్టసుఖముల మున్చి ముప్పతిప్పలువెట్టుట లోకపాడియేయని భావించితివా? అసలు నీమతమే భేదభావము దెల్పెడు ద్వైతము. అట్టి నీసంబంధమగు

ద్వైతమతమెంతమాత్రము నాకు నచ్చుటలేదు. ఆహాహా! అయద్వైత మెంత యన్వితీయానందసంధాయకము? దాని యందంతయు నొకకటే, ఫలము నొకకటే, పాపపుణ్యము లనలే లేవు. కష్టసుఖము లంతకు మున్నే లేవు. అయ్యో! లేకపోవు టేమి! కృత్యములందు పాపపుణ్యనిర్ణయము లేకున్నను అనుభవమునందు కష్టసుఖములు ప్రపంచంబునకు గన్పట్టక పోవు. అందువనే ప్రకృతికంతకును ద్వైతమతమే సిద్ధమగుమతము. దీనికి కృత్యమును అనుభవమును ప్రమాణము. ఔరా! నిజముగ.

గీ॥ పాపమునునది యెందునం • భవము దాని
యందుఁ బ్రతిపని కానంద • మతిశయిల్లు
దేనియందు స్వనాశమో • దానియందు
సంభమనివార్యముగ నొందు • కలభముగతి.

ఇది ప్రకృతిసిద్ధమగు ప్రవృత్తి. ఇట్టి జ్ఞానము:ండియు నాహా!

ఉ॥ ఎప్పగిదేవిరాగమున • నెందున నొప్పితిఁ దొల్తతొల్తలో
నప్పగిదంతరాగమున • నందున నిప్పుడు నింద్యునౌచునే
నొప్పగనయ్యొ "లోకమను • నుత్థితనర్తనశాలలోన హా!
యెప్పటి కేదిసంభవము • యెవ్వఁడెఱుంగుసమర్థుఁడిమ్మహిఁ

ఛీ! ఇంకనీవిషయమున చింతించుటయేతప్పు

గీ॥ స్ఫటిక ఖచితమైనట్టి ద • ర్పణమునందు
బ్రకృతి సర్వంబు నెబ్భంగి • ప్రతిఫలించు
నటుల నిర్మలంబగు హృద • యంబునందు
సర్వకర్మఫలంబులు సంఘటించు.

నా హృదయము స్ఫటికమట్టిదాటచే నేమైనదో యైనది. ఇంక నే నావిషయంబు లన్నిటిమఱచి నా దేవియగు మదనమాలిని యేమి చేయు చున్నదో యారసెదగాక. (అనుచు నాలుగడుగులువైచి యాగి) నాకెంత కును లోనికేతెంచుటకు గాళులాడుట లేదే.

మ॥ అపరాధం బొనరించినట్టి మనుజుం • డత్యంత భీతిఁ ధరా
ధిపు సాన్నిధ్యముఁ జేర సంశయిలు రీ • తిఁ నాకిదేమోయిలో
విపరీతంబుగ జంకునొందనయె నా • వేరొందు సాంగత్య దో

వపు మాహాత్మ్యమొ యేమొ కాక మఱియా • సంకోచమింకేటికా?
నిజముఁగ నేనెంతదుష్టుఁడ?

( మత్తకోకిల. )

పాపమీరమణీమణిన్స్పృహా • బంధఁ జేసితిఁ గట్టు? యే
పాపమెఱుఁగని బేల యీసతి • భర్తృమాన సవర్తియా
నీపరోజవిశాలనేత్రఁ బ • రేంగితాంగన సంగతిన్
పాపమంచు దలంప కేదరిఁ • బాసితిన్ దశరాత్రముల్.
ఔరార!

ఉ॥ ఏదినముం బదేపదిఁగ • నెన్నియొ సారులు వచ్చి దీని ప్రే
మాదరణామధుద్రవము • లానక యున్న తపించుచుండు నే
యీదశరాత్రమంతనెటు • లీదెనొ మద్విరహాంబుధిన్ గటా!
యీదినమైన దీనియెడ • నెంతయొ ప్రేమరసంబుఁ గుప్పెదన్.

(అనుచులోనఁ బ్రవేశించి మదనమాలిని యెందును లేకుండుట మహా శ్చర్యమున) ఏదీ? ఈయంతఃపురమున నెందును గన్పించదే? ప్రేయసీ! (కొంచెము నిదానించి) ఏమీనిశ్శబ్దము? (మఱలకొంచెము నిదానించి) ఆఁ ఏమీ చిత్రము? (చక్కఁగఁ బరిశీలించుచు) ప్రేయసీ? ప్రేయసీ? (మరల కొంచెము నిదానించి) ఏమీయద్భుతము? ఇదేమైనదియు బోధపడుటలేదే?

చం॥ పదిదివసంబులో దనుక • మద్వరదర్శనమందకుండమిన్
మదివిసిఁగంత నేయుసుఱుఁ • బాసెనొ? పాయక యున్న నన్ను తాఁ
బెదఱిలఁ జేయ డాఁగెనో? ని • మేషమునన్నెడఁ బాయలేని యీ
సదమల మానసింక మది • స్థైర్యతఁ జెందుచు డాఁగఁగల్గునే?

డాఁగిన నింకెచ్చోటడాఁగు ? (సాలోచనముగ) ఏమీమాయ? అరె! యీచెలికత్తెయు నేమయ్యె? ఇదేమైన నెట్టి పన్నుగడయోయై యుండునా? (కనులుమూసుకొనుచు) ఏమి పన్నుగడయై యుండు? హృదయమా! వృధాతర్కములఁ బొల్కనక యీ మహాసమస్యార్థమేమో చక్కఁగఁ ద్వరగా గ్రహింపుము? (అనుచు నట్లే దీర్ఘాలోచనమున గ్రిందఁబడునట్లుండును.)

మదనమాలిని—(భూగర్భమునుండి ప్రవేశించి మానపాలుని జూచుచు) ఓహో! ఇప్పుడు మహావిభ్రమ మనస్సముద్రంబున మునుంగుచున్నాఁడు? అదిగో! యేమో దీర్ఘాలోచనముపై, కైమఱచి సోలుచున్నాఁడు. అక్టే క్రిందఁబడునాయేమి? (చేతులు పిసుకుకొనుచు) ఎట్లు? ఇపుడేమిచేయుదు? (అనుచుఁ జప్పున శయ్యాదాపున కేగు చుండును)

మాన—(దీనస్వరంబున) హృదయమా? ఏమియు స్ఫురించుట లేదా? లేదా? ఏక మాత్రమును స్ఫురించుట లేదా? హా! (అనుచుఁ గ్రిందఁ పడఁబోవునంతలో)

మదనమాలిని—(సప్పునశయ్యాపైని తల్పమును గైకొనివచ్చి యాతఁడు పడఁబోవు స్థలమునందుఁ బఱచుచుండును)

మాన—(అంతలో నాతల్పముపైఁ బడును)

మదనమాలిని—(బెదఱున యీవలకువచ్చి, మఱల నాతనిదఱిఁ జేరుచు దనలో) ఔరా? నిజముగనే నిప్పుడీ పనినే చేయకున్నచో నా మూలముగ, నాయీనాథునకెంత మాపన వాటిల్లెడిది? (అతని పరికించి చూచుచు) నాథా?

ఉ. నీనిజమైననాయెడలి • నిక్కపుఁబ్రేమరసార్ద్రిమానసం
జేనిమిషంబునందయిన • నెట్టివ్యర్థ గృశియించ నట్టియో
మానవనాథ? నీయమల • మానసమందున నాయకార్యసం
ధానరహస్యవంచనము • తాఁగ్రొనిదార్ఢ్యతఁ గోలుపుచ్చెఁగా?

(జనాంతికముగ) నిజముగ నానాథునకింతవంతఁ జెందించినది నా వంచకత్వమే? ఛీ! ఛీ! యెంత దుష్పథను? (అతనిమోముఁగాంచి యులుకుపాటున) అయ్యో యిదేమి? నామనోహరుని దేహమందంతటను స్వేదబిందు ప్రవాహంబు పొంగిపొరలుచున్నదే, నాథా? నీహృదయంబునకెంత విచార వ్యాయామంబుఁగూర్చితినో కదా? (కన్నులుమూసుకొనుచు) దైవమా! నా పాపమును శమింపఁజేసెదవుగాక, (మఱలకనులుమూయుచు) నాథా? నీకెంత విచారము గల్పించితి? (అనుచుదనపైట చెఱఁగుతో వానికి మెల్లఁగ విసరుచు మహావిచారముగ)

శా॥ ఏమో యిక్కథలోకులందఱికి సం • ఖ్యేయార్థమై సత్యని
త్యామోదాయతమైననీతి కడుల • భ్యంబౌనటంచెంచితే.
ఛీ! మచ్చారిత్రమిాగతిం బరిణమిం • చెఁగాదె యిప్పట్టు. సం
కేమో! ముందెటులుండఁ బోనొ! విధిరా • లెట్లుండెనో! నాయెడన్.

(అంతలో మానపాలుఁడు నిట్టూర్పునిడఁగా నులికిపడి యీవలకు వచ్చివానిఁ జూచుచు) ఇఁకతొందఱలేదు, అదిగో మొదటమొదటఁ దాండవంబాడిన స్వేదబిందుకదంబంబంతయు శమించినది. మైమఱపు వదలుచున్నది. ముఖము సూక్ష్మవికాస జనితంబగుచున్నది. నారచించు నీ కపటనాటకమందు నాయకీనాయక పాత్రత్వరసంబు భంగంబగు ననుకొంటిఁగాని, మఱియు నిందునిది శ్రేయంకు మెఱుఁగునే యిడినది. అదిగో! కనులు మూయుచుఁ దెఱచుచున్నాఁడు. ఇంక నాయుద్యమంబున నే నుండెదఁగాక, (చాటునకేగి ప్రకాశముగ)

శ్లో॥ భర్తాయద్యపికామశాస్త్ర నిపుణోవిద్యాన్వితోనో యువా
దాతాకర్ణసమగ్ర ప్రసిద్ధవిభవ శ్శృంగారదీక్షాగురుః.
స్వప్రాణాధిక కల్పితా ప్రియతమాస్నేహేన సంవర్ధితా
తంకాంతం పశువద్విధాయతరుణీ జారంపతిం వాంఛతి,

మాన—(ఆలకించుట నభినయించి లేచుచు విస్మితముగ) ఆఁ, ఎచ్చటనో నా దేవికంఠస్వరము వినవచ్చుచున్నదే? (దిగువనున్న పఱుపు జూచి) ఇదేమి? ఈతల్పమిచ్చటిది? దీనినిట నెవరుంచిరి? ఇస్సీ! ఎంతమంద ప్రజ్ఞుఁడ? నారాజ్ఞి యీయంతఃపురముననే యెచ్చటనోడాఁగి యీ చిత్రము సేయుచున్నది. అది తెలుసుకొనలేక యెంతలో దానికాస్పదుఁడనైతి. (దిక్కులు పరికించుచు) మఱల నెచ్చటనోడాఁగినది. ఇంక నేఁ దెలుసుకొనలే కుందునా? తెలుసుకొనెదఁగాక. (అనుచు నొకవైపు నన్వేషించుచుండఁగా)

మదనమాలిని—(వెనుకఁగ ప్రవేశించి) ఇఁక నిచ్చట నీతల్పముండరాదు. (అనుచు దాని నెత్తుకొని జాగ్రతగ శయ్యాతలమందుఁ బఱచి మఱొకవైపున డాఁగును)

మాన—(అంతట నన్వేషించుచు నచట తల్పము లేకుండుటజూచి మఱింత విస్మితుఁడై) అరె? ఇంతలో నీతల్పమేమయ్యె? (శయ్యవంక

దృష్టిమఱల్చి) అప్పుడే ఆశయ్యాయుండె వరమర్చిరి! ఇదంతచూడఁగ నాకేమో మతి విభ్రమము వాటిల్లినట్లున్నది. ఇంతకుమున్న విననైన శబ్దస్వరమెవరికంఠ స్వరమో అదియును విస్పష్టముగ స్ఫురించుటలేదు. ఆస్వరము. నారాజ్ఞిదేయగునా కాదా? యని మఱల సందేహము గల్గుచున్నది. దృష్టిదృష్టమైన యిచటి తల్పమే మహామాయము కాఁగా. శ్రవణదృష్టమైన శబ్దమేమని నిర్ణయింపనగు? కాని ఆశబ్దార్థముమాత్ర మిపుడు కొంచెము కొంచెముగ స్ఫురణకు వచ్చుచున్నది. ఏమని? "జారంపతింవాంఛతి" అనఁగా? జారుఁడగుఁ బతిని గోరుచున్నది ఎవరు? "తరుణీ" ఓహో! సరె! ఎప్పుడు? ఎందుచే? అందుకు సమాధానములేదు. కాని, దీనికి పూర్వపదము "తంకాంతం పశువద్విధాయ" అని విననయ్యె. అనఁగా? "తంకాంతం" ఆమగని, ఏమగని; ఆప్రశ్న మనవసరము. ఇంతకుఁ దరుణముగలయాడుఁది యెట్టి నిపుణుఁడైనను, తనమగఁడగువానిఁబశుప్రాయునిఁ జేసిఱంకుమగని కోరుచున్నదని ముఖ్యమగు భావము. ఇట్టి వాక్యంబులు పురుషులెడ స్త్రీల కిల్లింబులు. అట్టిచో నివి నా రాజ్ఞినోట నెటులు వెలువడు? అది యసంబద్ధము. చూడంజూడ నిది యంతయు నా మనోగతియే. ఇది నిశ్చితార్థమే కాని వ్యర్థమనోగతికాదు. వణిక్పత్నీ సమావేశమునకుఁ బూర్వ మా యుద్యానవనంబున నీచవాగ్లంభితయగుచు నన్ను సమీపించిన వ్యక్తియే నా దేవి నెచ్చెలి. ఆవణిక్పత్నియని భావింపఁబడునదే మత్పత్ని. ఇఁక నిందు సంశయములేదు. (కనులు మూసుకొనుచు) పాపము శమించుఁగాక. (కనులు తెఱచి) మహా పతివ్రతా రత్నమగు నాదేవియం దపోహ మారోపించుకొనుచుంటి (సాలోచనముగ) ఏమీ! అపోహమా! ఎట్లు? ఔను. ఏలకాదు ?

సీ॥ ఆనాఁడు నాముందు • నంతసిగ్గునువీడి
యట్టె యంత్యమున వా • దాడు టొకటి
మగువ యెంచిన యెట్టి • మగనైన వంచించు
నరనిముసంబులో • ననుట యొకటి

యన్నివిధంబులన్ • దన్నుఁ గొలిచిన యొండు
సతియుండెనను భ్రమ • సలుపు టొకటి
యేదొ కార్యార్థినై • యేగ నా వనమున
దమి వృద్ధిఁజేసి నన్ • దార్చు టొకటి
గీ॥ యిప్పు డది యా గృహముఁబాసి • యేగుదినమె
యిటుల బంధింపఁబడిన యీ • యింటియందు
నిదియు లేకుండు టొకటి యి • ట్లిన్ని మదికి
దీని పన్నుగడనియె తా • ర్కాణమయెడు.

ఇంకను ఇందు సంశయమా? నిజముగ.

చ॥ అగునగు నీ గవాక్షముల • కట్టి నిబంధన లేమిచేయమిన్
దగవగు సేవకాళి నటు • దార్చుచు వారల కట్టి యాశరో
వగపునఁగూర్చి వార్లఁ దన • వశ్యులఁజేసుక బైట కేగఁగా
నగు విధమేదొ పన్నుకొని • యవ్వణిజున్ రమియించుచుండెనే.

లేనిచో సర్వవిధముల నొకరికొక రెనయగు టెట్లు? అది పోని అది లేనిదిసమే యిది లేకుంటు టేమి? నిస్సంశయముగ నదియే యిది. ఇదియే యగు. కాని యెంత సాహసురాలు! నాస్థైర్యత్వ మంతయు నణగార్చి, నాకనులకు కామాంధకార మనెడు కారముఁగొట్టి, నిజనాధుండనగు నన్నే జారున కుపజారునిగఁ జేసుకొని, సర్వోపభోగముల ననుభవించుచు నన్ననుభవింపఁజేసి, నేఁ జూచుచుండఁగనే వణిజుండగు మణిమంతుని స్వాంతసామ్యముగ నాతని వెంబడించి పోఁజాలినది. అందు కెంత మెచ్చవచ్చు? ఛీ! అందు కింక సిగ్గులేక మెచ్చుకొనవలె.

గీ॥ బాహ్యమందొండు నడవడి • మనసునందు
నొండు నడవడిఁగల్గి జా • రోపజార
సంగతి రహించునట్టి స్త్రీ • జాతియందు
దేని మెచ్చంగఁగూడ దహీనబుద్ధి.

నిజముగఁ జూడ,

చ॥ సతి యననొప్పు స్త్రీ యొకటి • క్ష్మాస్థలినుండునో లేదొ? యందఱున్
సతత పరాభిలాషహృది • సంగత ఠింగితవర్జ్యచేతసల్

వితత వివాదతత్పరలు • వేధవచస్కలుఁ జిత్తచంచలల్
సుతహిత భర్తృబంధు భయ • శూన్యల పూజ్య లనూయమానసల్.

ఇదియెల్ల నిక్కము. అట్టిచో నిట్టి స్త్రీ లుండు నేమి? మన్నుఁగల యునేమి? ఏమంటి? ఛీఛీ! దీ నొక్కదాని గుఱించి స్త్రీలనందఱ నిందించుట నాకొంట్ల కట్టిపాడి? పాడియో బాడియో నాపీడ వదలినది నాకదియే పదివేలు చాలు. ఆఁ మఱల నేమనుచుంటి? అట్లని మిన్నకుందునా?

ఉ॥ నాధు ననాధుగాఁదలఁచి • నైచ్యతఁగాంచి స్వవిద్యకంతకున్
సాధక మన్యనాధురతి • సంభ్రమసంగతి యుంచు మించి వై
శ్యాధము వెంటనంటి చను • నాకులట వ్యధియింపకే యెటుల్
సాధువుగాఁ జెంగుదును! • సత్వరమే నిదె వెంటనంటుదున్.

(అనుచుఁ బండ్లు పట పట లాడించుచు నిష్క్రమించును)

మదనమాలిని—[ప్రవేశించుచు]

మ॥ పతి యెంతో మది నన్ను మాయ సతిగా • భావించి రౌద్రార్భటిన్
సలియా నన్ను వధింపఁబూని చనియెన్ • సందేహ మింకేల? యీ
గతిగాఁ బోవుట యింక మంచిదెసుమీ? • కానిమ్మదే యేను నీ
గతిగాఁబోయి మఱొంకు చిత్రమును దాఁగాంచగఁజేయన్వలెన్.

(అనుచు భూగర్భమునుండి నిష్క్రమించుచుండఁగ నవనిక జాఱును)

(అవనిక లేవఁగా)

ప్రదేశము—నగరబాహ్యారామము.

[మదనవతి మణిమంత నే పథ్యంబువీడి స్వస్వరూపమున శయ్యపై
విచార మభినయించి కూర్చొనియుండును]

మదనమాలిని—(భూగర్భద్వారమునుండి బైల్వెడలి మదనవతిని జూచి విస్మితయై దాని ప్రక్కఁజేరుచు) మదనవతీ యిదేమి?

మదనవతి—(మదనమాలినిఁ జూచి (త్రుళ్ళిపడి) నీ విటకువచ్చి యెంత సేపైనది ?

మదనమాలిని—ఇప్పుడే కాని నీవెందుకు విచారమున నుంటివి ?

మదనవతి—అచట విశేషమేమి ?

మదనమాలిని—మన మనుకున్నదానికి భంగమేమియు లేదు. కాని నీ విచారమేమి?

మదనవతి—మన మనుకున్న విషయంబులన్నియు నిర్విఘ్నముగ సాగునా యనియే.

మదనమాలిని—(మందస్మితముగ) ఓసి వెలా!

గీ॥ నారచించు నీ కపటంపు • నాటకంబు
దైవకృప సమస్తంబుఁ బ్ర • దర్శనంబు

మదనవతి—(వారించి)
కాఁగలదు గాని దైవసం • కల్ప మన్య
మైనచో నిష్టనాధుచే • హానియొదవు.

మదనమాలిని—ఏమిహాని యొదవు?

మదనవతి—ప్రాణహాని.

మదనమాలిని—మన యదృష్టవశంబున నదియే యొదవుచో నింకఁ గావ లసిన దేమి? కాని యట్లు జఱుఁగదు. ఒకవేళ నట్లుజఱిఁగిననేమి?

గీ॥ పతియె తన సతిప్రాణంబుఁ • బాపఁదలఁప
నంతకన్నను సతికేమి • యవసరంబు?
సర్వపాప విముక్తయై • శాశ్వతముగఁ
బరమపదమందు సుఖయింపఁ • బడునుగాదె?

మదనవతి—ఔఁగాక. ఐన నిది సాంతమగులోపల నెన్నియో యనృతములాడవలెఁగదా?

మదనమాలిని—

గీ॥ అనృతంబొండెయేమి? ప • త్యనుసరణము
నందు జారత్వ మొండె చౌ • ర్యంబునొండె
యాత్మహత్యయు బ్రహ్మహ • త్యాది వివిధ
హత్య లొండె జూదంబొండె • యఘము లేదు.

మదనవతి—అదిసరె! ఇది యట్లేదేలయగు!

మదనమాలిని—నీయభిప్రాయమెట్టిదసి?

మదనవతి—ఈకృత్యంబుచేఁ బతిస్వాంత మిప్పు డెట్లులరుచున్నది?

మదనమాలిని—ఎట్లులరుచున్నది?

మదనవతి — పటుతరంబగుఁ గష్టమున నలరుచున్నదనినా యభిప్రాయము.

మదనమాలిని — ఔననుకో ?

కం॥ ఎంతగ మనచేనాధుని,
స్వాంతంబున గల్గుచుండెఁ • బటుతరకష్టం
బంతయు నింకఁబదంతిలు,
సంతోషమె పలికిచెందు • సత్యము మనచే.

మదనవతి — ఎప్పటికది సంభవము ?

మదనమాలిని — ఎప్పటికో యననేల ?

కం॥ ఎప్పుడు మనకథసర్వము,
జెప్పుచు బతిపాదయుగళిఁ • జేరుచువినయం
బొప్ప క్షమార్పణ గోరుదు,
మప్పుడె యీ కపట నాట • కాంతము శుభముగ.

మదనవతి — సోదరీ ! యీకృత్య మొనర్చుట కాలస్యమేల ?

మదనమాలిని — ఇప్పుడేమైన నపాయము రానున్నచో నీకృత్యమిప్పుడే చేయక తప్పదు. లేనిచో నీకృత్య మప్పుడే చేయుట లెస్స.

మదనవతి — (సంతసముతో) ఔనౌను. నిజముగా నావట్టునందే లెస్సగ నుండు.

సోదరీ? గీ॥ ప్రసన్నమనముప్డి • కర్పూర హారతుల్
మనదు కపటనటన • మునకు స్వస్తి
జెప్పుభంగిఁ గొనుచు • జప్పునఁ బతిఁజేరి
యతని దయను పొంది • యలరవచ్చు.

మదనమాలిని — మఱి నేనదేకదా చెప్పునది ? కాని వారు వచ్చు సమయమగుచున్నదిఁక పరుండుము ? (అనుచు లేచును)

మదనవతి — (దీనస్వరంబున) నీ విచ్చట కేగెదవో నాకిపుడేమో భయముగనున్నది.

మదనమాలిని — ఏమాత్రము భయపడకుము ? నిన్ను కాచుకొని యీ సమీపముననే యుందును. కాని నేజెప్పిన విషయంబు లేమఱక మిక్కిలి జాగరూకతను మాత్రము మెలంగుచుండుము ? పరుండుము ? (అనుచు నిష్క్రమించును)

మదనవతి —(శయనించును)

మాన—(చౌర్యనేపథ్యంబునఁ బ్రవేశించుచు దనలో)

గీ॥ కాలమనుగోఁచి తనయంధ • కారగర్భ
మానను లోకంబులను పిల్ల • లను విరతుల
సలుపుకై దాఁచుకోఁగ వై • చమ్యామొంది
గుద్దుకొని యవెల్లయుఁ జావఁ • గూడునదియె.

మ॥ అటులే యన్యకులాంగనారతిని యొ • ప్పావైశ్య వంశాధముఁ
బటురోషంబునఁ బట్టి చీల్పఁగ బలే • పట్టయ్యో నీరేయి, న
ప్పటికి న్లాఁ బగవానిఁ ద్రుంచుకొఱకై • పాల్పడ్డచో భూస్థలిఁ
దిటవా కీర్తిఁ గలాని కెప్పు డిదియే • దివ్యంపు మార్గంబగుఁ.

గీ॥ కాని యీ వణిజుండు నా • కాంతఁ ద్రుచ్చి,
లించినటులతోఁ పదు ద్రుచ్చి • లించియున్న
యింకనెట్టి స్థైర్యంబొంది • యీమదీయ,
నగరబాహ్య వనంబు నే • నెగడఁగలఁడు ?

శా॥ ఏమో లే యితఁడెట్టి పన్నుగడతో • నిచ్చోటనే యున్నచో
నేమంబంచుఁ దలంచెనో ? యెఱుఁగమే ! • జిత్తుల్ సమస్తంబునీ
భూమిఁ జంబుక రాశికిఁ మఱివణి • కూర్భాతాళికిఁ సొమ్మగుఁ
వేమారుల్ తరువంగ నేల నిదియే • విస్పష్టమిప్పట్టునఁ.

కాని యితఁడింత నిర్భయంబుగ నిచ్చటనే యుండుటకుగాఁ బన్నిన జిత్తేమియుండు ? (యోచన నభినయించి) ఓసి. యింతేనా?

గీ॥ ఈవనంబునందె • యీరేయి నుండుచో
ద్రోహి కాడితఁడు • సిద్ధోపియనుచు
దోషియగుఁడువల్లె • దూఱుమేగఁ జేయుంచు
నెంచిరానటంచు • నిచట నిలచె.

ఇదియే వీఁడు పన్నినజిత్తు. ఈజిత్తు నేగ్రహింపలేని నాబుద్ధి నత్తు వేల? (పండ్లు పటపట లాడించుచు) వీనినింతమాత్రమునే విడతునా? ఇంక వీనిపడ కెక్కడో యరసెదఁగాక (అరయుచుమదనవతిపరున్నశయ్యఁజూచి)

మ॥ అదిగో! టక్కులఱంకులాఁడి బలెగుఱ్ఱుంచన్ల్లి నిద్రించుచు
న్నది (చక్కఁగఁజూచిమొగము చిట్లించుచు) యేమీయిదియొక్క తే
విధవచె • య్యంబొప్పివండెక! (సంతసముగ) బలే
యిదియుంగీడున మేలెయయ్యెను సుమా • యీకండ్లతో నాదుయా
డుదివేఱొక్కని ప్రక్కఁగాంచనగు భ్రష్టునేయలేదెంతయుక్.

ఇందుకు మాత్రము సంతసమే యగుచున్నది, కాని

శా॥ వాఁడేడీయిట ! నాకు భీతిలి యిదే • బాగంచటోపారెనో?
(మదనమాలినుద్దేశించి పండ్లుపటపడలాడించుచు) ఓసీదుష్ప్రవర్తని?
నేఁడీవెంతయొకూర్చు నిర్భయరతిక్ దృప్తుండునై ప్రుక్కినీ
తోడున్నవ్యాముగాక యొక్క రుఁడె సం • తోషాత్త చిత్తంబుతో
నేడన్గాని పరుండెనో ? చెవు కటా? యేమే కులధ్వంసినీ?

ఛీ ఛీ ! పాంసులా ? నీస్మరణ శ్రవణదర్శనాదుల మాత్రము నే బ్రహ్మానందముం బొందు నాడెందంబున కెట్టి మంటఁ గూర్చుచుంటివే! కులటా ? నిన్ను జూచునంతనే యిపుడు నాయొడలు కంపించుచున్నది కదే! ఇంకనిన్నిప్పుడే వధింపకున్న నామంటచల్లాఱునా ? (సమీపించుచు)

ఉ॥ ఓసి దురాత్మురాల ? యిఁక • నోర్వఁగజాల నిదేమదీయ ఘో
రాసికి నీదుప్రాణముల • నర్పణ సేయు దినంబువచ్చె రా
కాసి! మహాసతీత్వమునఁ • గ్రాలినదానవటంచు నెంచితే
గాసిలఁజేయుదోపతిని • కడ్పున భగ్నగమంటఁ గూర్చెదో ?

(అనుచు నొడినుండి ఖడ్గముఁదీసి పొడువఁబోవును)

మదనమాలిని—(అంతలో వెనుకగవచ్చి వారించుటకు సిద్ధముగనుండును)

మదనవతి—(అంతలో నిట్టూర్పుని గుడ్చుచుఁ దనముఖవిలాస మాతని కగుపడునట్లు లోకవైపున కొత్తిగిలుచుండును)

సూన—(అంతలో దానిఁజూచి ముగ్ధుడై తనయత్నము మాని తనలో)
ఆహా ! ఇట్టి సౌందర్య లలామ నెట్లువధించుదు ? ఛీ మఱల
దీని సౌందర్యాదులకు ముగ్ధునగుటకన్న మూర్ఖత్వముగలదా ?
(మఱలఖడ్గము నెత్తుచు సాలోచనముగ) అసలిది స్త్రీహత్యకదా

)ఖడ్గము దింపుచు)ఇపుడేమియుఁ దోఁచుటలేదు. అవశ్యముగ దీని నిప్పుడే వధింపకున్నచో నామానమునకు భంగము. వధించుచో నాజ్ఞానమునకు భంగము. అసలదే యిదగునో కాదో ? ఇదేమి ? మఱల నగునా ? కాదా ? యను సంశయము కలుగుచున్నది ? ఎట్లు సిద్ధాంతీకరించుటకును వీలులేదు. అదే యిదగుచో నీవిధముగాఁ బోవునది. యెప్పుడో యీప్రదేశము సర్వము విడచి పాఱిపోవక నింక నింతవఱ కింత నిర్భయుంబుగ నిచ్చటనుండుట కిచ్చగించునా ? నాకట్టడి పట్టుదల యిదెటులుండగనిదియా ? ఇదంతయు నేమో యాశ్చర్యముగనే యున్నది. ఐనను లేపిచూచెద. (దానిచెవియొద్ద ముఖముఁజేర్చి మెల్లగ) మనోహారీ ! మనోహారీ ! (అనిపిలిచి యది లేవక పోఁగా దానిఁదట్టుచు)మదనమాలినీ మదనమాలినీ ! (అప్పటికి లేవకుండఁగా జనాంతికముగ) ఊఁ హూఁ ? (మఱల) శృంగారవతీ ! శృంగారవతీ ! —ఇట్లునుగాదు. సౌందర్యమాలినీ ! సౌందర్యమాలినీ ? — మఱొకవిధముగఁ జూచెద-ప్రేయసీ ! ప్రేయసీ !—ఇఁక పిల్పులతో లాభములేదు. (అనుచు దాని చెక్కిళులు దువ్వి యొడలుఁదవిడి)—ఇది నిజముగ గాఢమగునిద్రనే చెందియున్నది. ఇంత గాఢనిద్రఁ జెందుటకుఁ గతంబేమైయుండు ? ఏముండు ?

గీ॥ అదియె యిదియైనఁ గాకున్నఁ • బదిదినంబు
లుండి రేయుంబవల్లు నా • నుండి నేఁడు
వీని నుండియు రతిసుఖం • బొనియాని
యుండుకతమునఁ గడు స్రుక్కి • పండెనిటుల.

ఇంక నే నిచ్చట నేనిటుల తడవుసేయుచో నీసడి నెవ్వరైనఁ గన్పట్టఁ గలరు. కన్పట్టుచో నది నా సర్వమానంబులకును భంగకరంబు ఎటులైన నిచట నే నెవ్వరికంటఁ బడకయే దీనినిటనుండి తప్పించుట నాకిపుడు ముఖ్యకర్తవ్యము.

మ॥ చిటిపాపఁ భుజమందుఁ జేర్చి నిదురం • జెన్నారఁగావింపమే ?
యటులే దీనిని యిప్పుడున్న యతి ని • ద్రావస్థపోకుండనే

యిటనుంచెత్తుకవోయి నా గృహములో • నిష్టానుసారంబుగా
విటనారీమణియైన దీని నిజమా • వృత్తిన్ విచారించుదున్.
(అనుచు నెమ్మదిగ దాని భుజముపై నిడుకొని నిష్క్రమించుచు)

మ॥ ఇఁక నెవ్వండును నడ్డురాని యొకఁడే • యేమీ జగంబంత చ
క్కక నేతెంచి రణోన్ముఖుంబుగ నగున్ • గానీ! భయంబేమి? యి
ష్టాకనిన్ లక్ష్యము సేయుదో? చటుల ద • ర్పోద్దీప్తనామున్ భయా
వక రూపంబునఁ జిక్కఁ జేచనియుదున్ • దార్క్ష్యోరగన్యాయతన్.

(అనుచు నిష్క్రమించును)

మదనమాలిని.—(సంతసముగఁ బ్రవేశించుచు) ఆహా! నా కపటనాటకం బున నన్నిరంగంబు లమర్చుచుంటినో అన్ని రంగంబులును నే ననుకున్న దానికంటె వేయిరెట్టులు రసవంతములై సమగ్రముగ నే రమణీయంబుగఁ బ్రదర్శింపఁబడుచున్నవి, గాని యొక్కటియు వ్యర్థమగుట లేదు. నామనోహరుండిపు డిట కేతెంచి తానెవ్వరినెత్తుక పోవుచుండెనో తానెఱుంగఁడు. ఆ యెత్తుకొని పోఁబడు వ్యక్తి నేనేనని యాతని యభిప్రాయము. ఇదియే నా కపటనాటక మర్మ శృంగారము. ఇప్పుడిచట నేమి చిత్రము జఱిగెనో ఇంకముందేమి చిత్రము జఱుగఁబోనో నాకుతప్ప నా నాథునకే మెఱుక? మొదట మణిమంతాభిధమువనుండి యిపుడు నామాఱుగా భావింపఁ బడి నా నాథుచే ముచ్చిలింపఁబడిపోవు నా చెల్లెలగు మదనవతి యిఁక మీఁద చేయఁబోవు శృంగారమే పరమ నర్మశృంగారము యింక నేనును సత్వరముగనే పోవలయును. (భూమిపై దృష్టినిల్పి) ఆహా! తగునంత ధనమున్నచోఁ దలఁచునంతపని యేల పొసఁగదు? నగరాభ్యంతరవనమునుండి యీ నగరబాహ్య వనంబునకు సైతము నొక్క వేయిరత్నంబులు మనవి కాదనుకున్నంతనే యెంతో చమత్కృతి నొప్పి యీ భూగర్భరహస్య ద్వారమేర్పడినది. ఈమార్గంబున నొక నిముసంబులో నచ్చటకు చేరఁగలను. ఇంక దేనికాలస్యము? (అనుచు నచటిభూగర్భద్వారమునుండి నిష్క్రమించుచుండఁగా నవనిక జాఱును).

( మదనమాలినీ కేళీగృహము. )

(మానపాలుడు తాదొంగిలించి తెచ్చిన మదనవతిని శయ్యపై నునిచి)

మాన—(దానిని బరికించుచుఁ దనలో) ఇదేమి! ఇది శృంగారవతీదేవియు మదనమాలినీదేవియుఁగాక మఱొకవింత రామణీయకంబున జెలువొందుచున్నదే! ఏమీ యాశ్చర్యము. (ఆలోచన నభినయించి)ఇందుకై యాశ్చర్యపడ నవసరము లేదు. యౌవనమునందు ప్రతి స్త్రీయు నిట్లొక్కొక్కతఱి మార్పుగా గన్పించుట సహజసిద్ధము.

గీ॥ ఒక్కతఱి జగన్మోహిని • యొక్కొ! యనఁగ
నొక్కతఱి బరిచారిక • యొక్కొ! యనఁగ
నొక్కతఱి వారకామిని • యొక్కొ! యనఁగ
నొక్కతఱి గులకాంతన • నొప్పు యువతి.

అందుచే నిది ఆయిర్వురిలో నేదో యొక్కతె కాకపోదు. లేక మదనమాలిని శృంగారదేవీయభిఖ్యలగు కులటవ్యక్తులుగాక వేఱుగానిది మణిమంతుని నిజధర్మపత్నియైయుండునా! (చక్కగా దాని బరికించుచు) అట్లనుకున్నను భేదమంతయెక్కుడుగా గన్పించుటలేదు. అదుగో కొంచముగాఁ గదలుచున్నది, ఈసమయమున నే దీని బాగుగా మేల్కొల్పి డాఁగినచో దీని కలవరింపు టాలాపంబులచే నిజానిజములు బయల్పడగలవు. అట్లే చేసెదఁగాక. (అనుచు దానిని బాగుగా గదలించుచుండును.)

మదనవతి—(వినుగునభినయించి) అబ్బా! ఏమిటండీ? మీకెప్పు డొకటే పిచ్చి.

మాన—(తనలో) ఆహా! (ఇపుడు బాగుగా మెలకువునకు వచ్చుచున్నది ఇంకను గదలించి డాఁగెదగాక. (మఱల దానిని బాగుగా గదలించి డాఁగును.)

మదనవతి—(వెనుకకు చేయిత్రోసిచ్చి) అబ్బా! చాలు లెండు. ప్రయాణము సమయములో సైతము నిదేపిచ్చియా! ఇపుడేకదా నేఁగనులుమూసినది. ఇంతలోనే మఱల లేపెదరేమి. (చిఱునగవున వెనుకకు మఱలుచు) మీకు నిదురపట్టుటలేదా! (తనప్రక్కనెవరుఁగనిపించకుండుటచే విస్మితమభినయించి) సరె సరె! ఇంతలోనే నామీద కోపమా? (లేచి కూర్చుని నలుదిక్కులు బరికించుచు

మాన—ఇదుగో! దేని కిట్లు భయపడెదవు ?

శా॥ ఈభంగిన్ భయమొందెదా తగునటే? • యీవైపుగాఁజూఁడు! నీ
వే భూపాలు మనంబు దొంగిలితివో! • యే భోగములొ్వందితో
ఆ భూపాలుఁడ నిన్ను దొంగిలి తదీ • యంబైన భోగంబులన్
నే భోగింపఁగ నున్నవాఁడ మగుడన్ • నీయందె నిక్కంబుగన్.
ఇఁక నెంతమాత్ర మనుమానింపకుము. (అనుచు దాని నోదార్పు
టకు దాని పైఁపైపై, జేయివేయఁబోవును)

మదనవతి—(వానిని నెట్టుచుఁ గోపంబుగ)

ఉ॥ ఓలఘుబుద్ధి! తాళుమటు? • యూరకచూచుకొలంది నింక పై
వ్రాలఁగఁ జూచుదో ఖలుఁడ? • పైగ రవంతయు లజ్జలేక భూ
పాలునటంచు వచ్చెదవు • పాపియు దొంగయుఁగాక యెట్లు భూ
పాలుఁడు దొంగిలించుఁ బర • భామల నెంతటి మోహముండినన్.

మాన—ఓహో! నే నీప్రచ్ఛన్నమున నుండుటచే గుర్తింపఁజాలకుంటివి.
కాని నిజముగా నీ మనోపాలుఁ డగు మానపాలుఁ డను.
మహీపాలు నగుదునో కాదో యిపుడే చూడఁగలవు. (అనుచు
నిష్క్రమించును)

మదనవతి—(చిఱునగవున పెదవి గొఱుకుకొనుచుఁ దనలో) సరే
రానిమ్ము.

మాన—(చౌర్య నేపథ్యముఁ దీసివైచి స్వస్వరూపమునఁ బ్రవేశించుచు)
ఇదుగో! ఇప్పుడైనను నే నెవ్వరనో గుర్తించుము?

మదనవతి—(ఆశ్చర్యముతో జూచుచుండును)

మాన—ఇఁక నెంతమాత్రమును జాగొనరింపక శీఘ్రముగ నీ బిగికౌఁగి
టిం జేర్పుము. (అనుచు దాని చేయిఁ బట్టుకొని) రమ్ము.

మదనవతి— (చేయివిదల్చుకొనుచు)

ఉ॥ చాలునుచాలులెండిఁకను • క్ష్మావరులన్న ఘనంబదేమి పో!
స్త్రీ లతిచంచలాత్మలని • చెప్పుటలగ్గగుఁగాని యిట్టి భూ
పాలురు నిశ్చలంపుహృదిఁ • బాయుచు నన్యసతిన్ దలంచుచో
నేలికొనఁ దర్పారే బుధులు • కీర్తి తొలంగదె! ముప్పుఁగల్గదే.

ఏదెట్లున్నను అయ్యో! ఇంకేమున్నది? అనగర బాహ్యారామమున నా నాథుండీరేయియే యెట్లయినను నేనిట్లు ముచ్చిలింపఁబడుట గుర్తించు. వెంటనే సేవకుల నలుదెసలకు నన్వేషింపఁ బంపు. అప్పుడితరఁబుగ నెట్టి జాడలుఁ జిక్కకుండుటచే అసలు నాభర్త దొడ్డ యనుమాన పురుషుఁడు. పదంపడి మిగులనేవలమారివాఁడు. అట్టిఁడీ నాజాడ నెట్లయిన గుర్తించకుండునా? గుర్తించి యే రాజన్యుల సహాయము నన్నో మగుడ వచ్చి నీ మీఁదికి దండెత్తకుండునా? పిదప జయాపజయము లెవ్వరివైనను నాకళంకము దేశదేశముల వ్యాపించదా? అయ్యో! అయ్యో! రత్నవర్తకమణిమంతుఁడనియు మహా పండిత మణిమంతుఁడనియు దాన కర్ణమణిమంతుఁడనియుఁ బలువిధంబులుగాఁ బేర్కొనఁబడి దిగ్దేశములతన యశశ్చంద్రికల వ్యాపింపఁజేసిన యంతవాని భార్యయగు శృంగారసౌందర్య మాలినియనునది యొక భూపాలునితో నున్నదన యెంత యప్రతిష్ట? రహస్యముగా నెట్టిదుష్పథమున వర్తించుచున్నను శృంగారవతి సతీశృంగారవతియనియీ చేబిరుదువహించి పితృభర్తృవంశంబులకంతకును ప్రఖ్యాతిఁ దెచ్చిన నేను నిజముగా నింక జీవింపఁగలనా? భూవరా! ఇదేమి ఘన కార్యమని యెంచితివి? మఱల కొలఁది దినములలోనే వచ్చి యిరుల కెంతమాత్రమును దెలియకుండునట్లు తమ ప్రేమసుధారసంబును దృష్టికరంబుగఁ గ్రోలుదునను నడియాసతో నుంటిని గాని యింతలోనే నీవింత కట్టడితనంబున కొడిందగట్టుదువని కలనైన దలంచలేదుకఁదా? ఇంతలోనే యేమి మునిగిపోయినదని యిట్లొనర్చితివి రాజా! నీకును నన్నుమించు సౌందర్యవతియగు భార్యయేకలదు కఁదా! ఇదేమింత నీచకృత్యమునకుఁ బాలుపడితివి? రాజా! రాజా! నీవు నిజమగు రాజువే? నీవేమిరాజువో నాకు బోధపడుటలేదు. ఛీ ఛీ! (కనులుమూసి క్రిందఁ బడఁబోవును)

మాన—(వారించి పట్టుకొని తనలో) దీని దీనాలాపంబులు వినుచో నా గుండె జలదరించుచున్నది. ఏమిచేయుదు? నే ననుకున్నదొకటి యైనదొకటి (దానిని బుజ్జగించుచు)

మ॥ అబలా! బాలవిధంబుగా నిటుల న • న్నాడంగ నాయంబె నీ
సొబగున్ముద్దుల మాటలొల్కు మొగము•న్సొంపైన వాక్యామృతం

బుబలాటంబుగ వెల్లడించినను మోహోద్దీపితుఁజేసినం
త, బలప్రౌఢవు నీవకావ! కనవా తప్పేమి చూపెట్టుమీ.

మదనవతి—(కనులు తెఱచి యాతని చెక్కిళులుదువ్వుచు) మనోహరా! నిజముగా నీ తప్పేమియులేదు. కాని ఇఁక భావి కర్తవ్యమేమో నిర్ణయింపుము.

మదనమాల—(భూగర్భమునుండి చప్పుడు గాకుండ ప్రవేశించి రెయొక మూలదాఁగును)

మాన—మనోరంజనీ! (అనుచు దాని గడ్డముఁబట్టి)

ఉ॥ ఆర్యకులావతంసుఁడగు నాత్మ సమానుని భార్యవైన నీ
చర్య సువాగ్మనోనుతము సర్వజగైక విభాసితాంగ సౌం
దర్యముఁ బ్రేమపుంబదము నైజము నీకల నట్టి నిన్ను దు
ష్కార్యము చేసి ఖేదమున గాసిలఁజేసితి నెంత దుష్టుడన్.

రమణీ! ఇంక గతించినదానికి చింతించిన ఫలమేమి? కొంచెము తడవాశయ్యపై విశ్రమించుదము రమ్మ? (అనుచుఁదాబట్టుకొనియే శయ్యాతలము సమీపించుచుందురు)

మదనమాలిని—(ప్రవేశించుచు) (తనలో) నారచించి ప్రదర్శించెడు నీక పటనాటకమునందు కథానాయక పాత్రము నెంతగాఁ దనకు తెలియకుండా తనకిడినను మిక్కిలి రసవంతముగనే రంగమును శోభించుచున్నాఁడు నిజముగ నానాథుఁ డెంతటిసరసగుణాన్వితుఁడు? కానిమ్ము? ఇంక నాకృత్యమునసే (బ్రవేశించెద) ప్ర॥ అఁఅఁ మదనమాలి నీ కేళీసౌధ మందెంత పని జరుఁగుచున్నది?
(శృంగారదేవి మానపాలురు త్రుళ్ళిపాటున నభిముఖులై విభ్రాంతమునఁ జూఁచుచుందురు)

మదనమాల—

గీ॥ ఎవఁడు తన మనోహరు డౌఁచు నెసగుచుండు
నతఁడు మఱియొక్క-దాని సంగతినిఁజేర
నోర్వజాలునె? యేమంచియు విదయైనఁ
బుంశ్చలీవృత్తిఁ జరియించుఁ బొలఁతియైన.

(క్రమముగాఁ గోపము నభినయించుచు) అట్టిచోఁ హీనకులజాత యగుదీనిని. ఈవగలాఁడిని మహారాణినగు నాయంతఃపురమునఁ జేర్చి నాశయ్యపై నానాథుఁడే స్వయముగా నలంకరించుచుండగాఁ నేనెట్లు సహింపఁగల్గుదు?

గీ॥ అగ్నిఁగాలిన ఛేదితంబైన నొఱపు
వలన బాధితంబైనను స్వర్ణమెపుడు
దుఃఖమొందదు గురిగింజతో సమముగఁ
దూఁగుటను నదిఘటియింప దుఃఖమొందు.

ఆగతియేనాకు సంభవించినది. ఇంక నేనీ యవమాన జనితదుఃఖ మెట్లు భరింతు? నాకిఁక గతియెయ్యది? విధీ! నాకింక నన్యశరణ్యమేమి? సర్వవిధంబులను నానాథునిచేతనే నేనవమానితనైతి. ఎట్టి యసూయఁ గూర్చకనే పరదారా సంగమాభిలాషుండగుఁ బతిఁ గలదాననైతి అట్టి పతిహృదయమునకే యసతిగా భావింపఁబడితి. తుదకీ సతీయంతఃపురమే యసతీ విలాసపురమయ్యె. ఛీ! ఇంక నేనీ ప్రపంచమున దేనికుండవలయు. మహారాజ్ఞినగు నేనేయిట్టి కట్టడితనంబుఁ గనులారఁ గాంచుచు నోర్వఁ గలనా? హా విధీ? ఇంకనాకుగతియెయ్యది?

మ॥ మనసారన్వరియించి యేనిసతినై వహార్ఘ్యంబు వోనాఁడియె
వ్వని ప్రాంతంబునఁ బ్రౌఢవోలె నెపుడు • న్వర్తించియుంటిన్. మఱె
వ్వనిపాదద్వయిసేవయే స్వతరణోపాయంబుగా నెంచితా
ఘనుఁడే, నాకుఖలుండుగాగ గతి, యీ • త్మ్యాతప్ప వేఱున్నదే?

(నేలపైపునకు దృష్టిమఱల్చియొంగి చేతులుఁలొగ్గుచు) హేత్మ్యాజననీ.

చం॥ సకలచరాచరంబులకు స్థానమువై స్థితి కారణంబవై
వికలతలేకస్థాయియగుఁ బెంపుడు తల్లిగ సర్వజీవకో
టికిఁ గతిగూర్చునిన్నుకను • డెందమునందు స్మరించితమ్మరో
యిఁకమదిసంశయింపకఁ ద్వ • దీయసదోదరమందుఁ జేర్చుకో?

తల్లీ! జగజ్జననీ! నీవేనాకుగతి. ఇదే నీగర్భమున జొచ్చుటకు నిశ్చయించితి. మార్గమిమ్ము? భర్త్రనాదరణ జనితదుఃఖశీనగు నన్ను

నీగర్భమున దాఁచుకొనుము? ఆహా హా మార్గమొసంగితివా? ఇదేవచ్చు
చున్నాను. ధన్యోస్మి ధన్యోస్మి. (అనుచు భూగర్భమునఁ జొచ్చును.)

మాన—(విభ్రాంతితో మదనవతినిజూచి) ఏమీ చిత్రము ?

మదనవతి—(నిట్టూర్పు నిగుడ్చుచు) చిత్రమేమున్నది ? అప్రతిష్ఠాసూచకమగు నాభావి జీవనమున కుత్కృష్ట మార్గమిదియని చూపిపోవచ్చిన ప్రతిష్ఠా దేవతయోయన నొక మహాద్భుత ప్రదర్శనముఁ జూడఁ గల్గితి. నాకు నిదియేమార్గము. (మదనమాలినివలె) హే త్న్మమాతా ? ఇదేనేసైతము. నీగర్భమున జొచ్చుచున్నాను. మదనమాలినీ దేవిని దాఁచుకొనినచోటనే నన్నుగూడా దాఁచుకొనుము ? ఇదే నీగర్భమున జొచ్చుచున్నాను (అనుచు నల్లే భూగర్భమున నంతర్ధానమగును)

మాన—(నిట్టూర్పు నిగుడ్చుచు క్రిందనుండియే కొంతవరకు శయ్యాపైన వ్రాలి తనలో) ఏమిది ? ఇదంతయు నింద్రజాలమువలె నున్నదే! (కనులుమూసుకొని మఱల తెఱచి ఏకదృష్టితో) ఆనందా? నీవాక్యములన్నియు వేదవాక్యములు గదోయి ? స్వరూప మాత్రాబలలగు మాత్రముననే స్త్రీలను నిర్లక్ష్యముగాఁ జూడఁదగదు. స్త్రీయనఁగా సర్వసమర్థయగు ప్రకృతి స్వరూపయని యెఱుంగుము? మానుచో నెంత దిట్ట నట్టిట్టు చేయఁగల శక్తిగలట్టిదాఁడుది, ప్రేమించుచో నట్టి విరాగు ననురాగు నొనర్చి సరాగములాఁడఁగలట్టి దాఁడుది. ఇపుడైననీమదనమాలిని యీవిధంబుగా బేలవై ప్రార్థించునప్పుడే యీమె ప్రార్థన మంగీకరించి జాలివహింపుము? ఈమె యిష్టాను వర్తిత్వమే నీకు శ్రేయఃప్రదము, లేనిచోఁ జెడిదవు, అనుచు నింకేమో నాకు తొల్తనే బోధించితివి. ఆత్మసమానుఁడవగు నీయట్టివాక్యములన్నియు నప్పుడే త్రోసిపుచ్చితిని అదే మొదలు నీక్షణమువరకు నేఁగాంచుచున్నవన్నియు విచిత్రప్రదర్శనములె. అన్నియు నాశ్చర్యాంశములే. నేనేవిషయమున నాదినము నామదనమాలినిని గృహంబున నునిచి, కవాటబంధనమొనర్చి లాక్షాముద్రనమర్చుచు నీక్షణమువరకట్టి పనినే శ్రద్ధవహించి చేయుచుంటినో ఆవిషయముననే నేనట్టి పరిశీలనములో

నున్నట్లుఁ గన్పించదు. చూడంజూడ నిదేమో అయోమయ
ముగానున్నది. నాగుండె బండపారినది. నాహృత్పథంబున నీవు
తప్ప మతేమియుఁ గన్పించుటలేదు. ఆనందా? పరమార్థ తత్వ
ప్రకాశకానందా ? నీనిశ్చల మనోతత్వోప దేశార్థమంతయు,
నిప్పుడు బాగుగా స్ఫురణకు వచ్చుచున్నదోయి ? యానందా ?
(మఱల కనులుమూయుచు) ఆనందా ? ఇప్పుడొక్కసారి నాయొ
ద్దకు రాఁగలవా ? ఆనందా, ఆనంధా ?

ఆనం—(అకస్మికముగఁ బ్రవేశించి) సచివాగ్రగణ్యా ? ఏమిది ! యిట్లుం
టివి !

మాన—(త్రుళ్లిపాటున లేచి) ఎవరునీవు.

ఆనం—ఆనందుఁడను.

మాన—(విభ్రమమున నలుదిక్కులుఁ బరికించుచు) ఈయంతఃపురము
న కెట్లు రాగల్గితివి ?

ఆనం—(ఆశ్చర్యమున తనలో) నిజముగా నేనిచ్చట కెట్లురాగల్గితి ?

మాన—చెప్పవేమోయి ?

ఆనం—ఏమని చెప్పుదును ? నాకిది స్వప్నమాయని యోచించుకొను
చుంటి.

మాన—(నిట్టూర్పుతో జనాంతికముగా) ఇదొకచిత్రమా!

ఆనం—ఏమీా? యిదివరకొక చిత్రమును గంటివా?

మాన—ఒకరేయునవేల నేగాంచుచున్నవన్నియు జిత్రములే!

ఆనం—ఏమేమి చిత్రములో చెప్పగలవా?

మాన—ఇంక నీయొద్ద రహస్యము దేనికి చెప్పెద వినుము.

ఆనం—చెప్పుము ?

మాన—(తల విసరుచు) ఊఁ హు! చెప్పజాలను.

ఆనం—అదేమి?

మాన—సంగ్రహముగా నైనను జెప్ప దలంచితిగానీ, సంగ్రహముగా
గాదు సరికదా! యేమాత్రమును జెప్పజాలను.

ఆనంద—ఎందుచే?

మాన— అవి నాసంసారసంబంధములగుటచే జెప్పజాలను. నన్ను క్షమించి కొంచె మూరకున్నచో నాహృదయమునకు విశ్రాంతి దెచ్చుకొనెద. ఇక నన్ను పల్కరించకుము. (అనుచు మొదటివలెన యొత్తిగిలును.)

అనం— (జనాంతికముగా దనలో) ఈతనికి నిజముగా దన సంసారమునందు మహాద్భుత చిత్రనాటక మొండు జరుగుచున్నట్లు సూచింపబడుచున్నది. ఈమహాద్భుతంబున మునింగి తెరువేమియు గానంచక చింతిలుచున్నాడు. నిజముగా నీతడు సరసుఁడే యైనచో నీ సంసారమందలి సుఖదుఃఖంబుల నేల లక్ష్యపెట్టు?

చం॥ సరసుడు చూడ నెన్నడును • సంసృతియందు లభించు దుఃఖముం
బొరయక సౌఖ్యముం గనక • బొల్పుగనే నొకసాక్షి భూతుడై
బరువడి నాకు సంసృతికి • బంధము లేదది తన్ను బొందుచో
గురుదృఢబంధమై మగిలి • గూలుచునంచు దలంచి ముక్తుడౌ.

అట్టి మార్గమితడవలంబింపలేదు. కాని అంతసులభముగు మార్గము మాత్ర మీతనికి లభించినది. ఈతని కీసంసారమందలి చిక్కుల వలననే యీతని హృదయ మిప్పు డీవిధముగా స్థిరపడియున్నది. ఇదియే నిశ్చలమనము, ఈ నిశ్చల మనోదృష్టిచేతనే నన్నుస్మరించిచూచి యుండవచ్చును. లేనిచో నేనిప్పు డిచ్చట కెట్లు రాగలను. నా యీరాక కుగల కారణమీతని నిశ్చలమనోదృష్టిప్రభావమే. ఆహా! ఏమీ నిశ్చల మనోదృష్టి ప్రభావము. దీనియందెంత మహాద్భుతపు నాకర్షణశక్తియున్నది. ఓరా! దీనినేకదా యార్యులు బండగుండయనికూడా చెప్పుదురు. ఇది కలవాడు దేని తలంచిన సఫలీకృతుడు కానేరడు? ఈతత్వమునే నాదికాలమునందే గ్రహించితి. గ్రహించి యొకరికి బోధించుటేకాని నేను మాత్రమవలంబింపలేదు. ఛీ నాదియు నొకజన్మమే. ఒకరితో నాకు పనేమి? నామార్గమునే జూచుకొనవలయు. నైనను నాజన్మము పరోపకారచింతనమునే ముక్తినొందవలయు. నాపరోపకారచింతన మీవిధంబుగ జేసెదగాక.

ఉ॥ ధారుణి మూఢమానవుఁడు • తత్త్వమెఱుంగక భార్యనాది సం
సారము నాది నాది పశు • జాలము బిడ్డలు నాఁడు బిడ్డలా

నారయఁగష్టముగ సుఖము • నంతయుగొందెను వాఁడనేనటం
చారయఁజాఁడు ముక్తిపథ • మట్టి జడాత్ముఁడు జ్ఞానికావుకగ.

ఇదియే నా పరోపకారచింతనము. ఇఁక నాయాత్మ చింతనమిది.

చం॥ నిజమగు నాత్మచింతనమె • నెట్టనఁజేసెడు వాఁడనేని నే
నిజముగ సర్వమానవుల • నెమ్మెనె యెంచెడువాడనేని నే
నిజముగ నెప్పుడెట్టి చెడు • నే స్తత దుష్కృతన్నైనఁగాని నా
నిజపథమెల్ల నాకిపుడె • నింకుగఁ బాల్కొని ముక్తికల్గుతగ.

ఈ చింతనమునే నిశ్చలమనముచేఁ జేయుచో నాకేల ముక్తికలుగదు? కలిగినది. ఇప్పుడే నాకు ముక్తికలిగినది నాకిచ్చట నేమియులేదు. ఇచ్చటనే యేమి? ఎచ్చటను నేమియును లేదు. (కనులు మూసుకొని) అంతయు శూన్యము గాఢాంధకారబంధురంబగు నీ మహాప్రకృతియందు అదుగో సర్వవ్యాప్తమగు నొక మహాద్భుత తేజము వెడలి తాండవం బాడుచున్నది. ఆహా? సమస్తమును దేజోమయమే? ఈ తేజముతప్ప మఱేమియులేదు. అదుగో లేదనునంతలో నది మాఱుచున్నది. ఉన్నది, ఉన్నది. ఆ సర్వవ్యాపక తేజము మహోద్దీప్తమై విరాజిల్లుచున్నది. ఆహా హా అదియే నిత్యముగుఁ బరమాత్మ యందేలీనముకావలయు. కావలయు అగుచున్నాను. ఇదే స్వస్వరూపమున లీనమగుచుంటి. (అనుచు నొక మహాతేజమున నదృశ్యుఁడు కాఁగా నా తేజము శమించును).

మాన—(కనులు తెఱచుచు, అనందా? ఆనందా? (అనిపిలచి కన్పడకుండుటచే తనలో) ఏఁడీ యానందుఁడు? (లేచి నలుదిక్కులుఁ బరికించి) ఈతఁడసలు రానేలేదు. ఇదొకచిత్రము? చూడంజూడ నాకిదేమో యొక మహాద్భుతపు స్వప్నావస్థవలె నున్నది. లేనిచో మహా పతివ్రతారత్నములందుఁ జేరిన నా మదనమాలిని భూగర్భమునఁ జొచ్చుటయనది పూర్వీయులఁ జరిత్రలఁబట్టి నమ్మఁదగిన నమ్మఁదగుఁగాక. పుంశ్చలీ శిరోమణియనఁదగు నీ వణిక్పత్ని భూగర్భమునఁ జొచ్చఁగల్గుటెట్లు? ఛీ! మదనమాలిని సైతము మహాపతివ్రతలలోఁ జేరుటెట్లు? పతియొనర్చు కృత్యంబు సహింపలేని దొక సతియా? కాకపోవుఁగాక. ప్రకృతమున మాత్రము

దానిఁ దలంచుచో నా హృదయమునకు మిక్కిలావేదనమే కలుఁగుచున్నది. ఏల కలుఁగరాదు ?

ఉ॥ ఎన్ని విధాలకున్ దనకు • నెంతయు నెంజిలిఁ గూర్చునట్టి వి
చ్ఛిన్నపు బంధితక్రియకుఁ • జెయ్యముడుంగక సర్వకాల సం
ఛన్న మహాముదప్రథిత • సంభృతయై ప్రతియోగమూనకే
యున్న మహాపతివ్రతక • యూరటఁ గూర్చితి స్వల్పబుద్ధినై.

ఒక్క దీనికేయేమి? ఛీ ఛీ ఛీ !

ఉ॥ ఛీ! యినుమంతలజ్జయును • జెందక నీచ పథానువర్తినై
నేయమునన్ రహిన్ జెలఁగు • నీతివిశారదుఁడైన యావణి
గ్జాయను బ్రముచ్చిలించి కడుఁ • గష్టము లాతని పాలొనర్చి
బాయని మిత్రఘాతుకపుఁ • బాపముకే యొడిఁగట్టి తక్కటా ?

ఔ రౌరా! యీ మిత్రఘాతుక మహాపాతకంబెట్లు పాయుదు ? ఇంకఁ బ్రజల మొగమే నెట్లు కాంచుదు ?

గీ॥ పుడమి నెట్టి పాపములైన • ముక్తి కలదు
గాని యెప్పట్టు నెవ్విధి • నైన మిత్రు
నెడల నపకారమొనరించు • జడునిపాప
మెప్పు డెవ్విధినైన క్ష • మింపఁగలదె?

ఆ క్షమించు టెటులున్నను బాల్యమునుండియు నా వర్తించిన వర్తనమెట్టిది ? ఇప్పుడీ పరిణమించిన పరిణామమెట్టిది ?

ఆ. గీ. తొలుతతొలుత నెంత • దుర్మార్గుఁడై యున్న
మీఁదమీఁద నొందు • మిగులమంచి
కార్యమందుఁ జెలఁగ • ఘనవంతుఁడతఁడంచు
సర్వజనులు వాని • సంస్మరింత్రు.

అటులే

ఆ. గీ. తొలుతతొలుత నెంత • తోరంపు సత్కీర్తిఁ
గ్రాలియున్న నొందు • కలుషకృత్య
మాచరించునేని • యతిదుష్టుఁడని వాని
నిలను సర్వజనులు • నేవగింత్రు.

అట్టి యేవగింపుఁ బ్రతుకుబ్రతుకుఁగంటె జీవములఁ బాయుచో మేలుగఁదా? (యొకసినుండిఖడ్గముఁదరాసి) ఖడ్గమా? (అనుచుదానిసాలోచనముగ దువ్వుచున్నంతలో)

(భూగర్భమున)

మ॥ పతియేదైవమటంచు నెంచుసతి స • ద్భావంబు సర్వంబునుం
బతినేమోసముచేయఁగాఁదగిన దు • ర్భావంబుగామార్చి యా
పతినెంతోకడు విభ్రమత్వమునముం • పంజేయుబ్రాలా? యిదే
సతియానన్నటఁజేర్చి శీఘ్రముగ ను • స్వాంతుఁ బతిఁ జేయుమా?

(ఆలకించి) ఎచ్చట దీధ్వని? యీధ్వని మదనమాలినీ కంఠధ్వనియే హృదయమా? ఏమిట్లు విభ్రమపడుచుంటివి? ఈధ్వని యీభూగర్భము నుండియే వచ్చుచున్నది. నిజముగ నీయువిద లిక్కారను ఈ భూదేవియే తనగర్భమునఁ దాఁచుకొనినదగుచో, నాప్రార్థనముసైత మంగీకరించి మగఁడవారల నాకనుల కేలచూపదు? అదియంతయు నిజమేయగుచో నిది యు నిజమేయగు. (మోకాళ్లపైఁ గూర్చొని భూమిపై కేల్దోయిమోడ్చి) జననీ? (అనునంతలో భూగర్భద్వారము దెలుపఁబడఁగవిస్మితుఁడై) ఇదేమి? ఇచ్చట నప్పుడే ద్వారమేర్పడినదేమి? ఇచ్చటనేఁడే లోకోభూదేవి పిలువ కనే పలుకుచున్నది. పిలచినంతనే నోటు తెఱచుచున్నది. ఆఁ అనునంతలోఁ నిర్వరమింగినది. ఇఁక నన్నుసైతము (అంతలోఁ గర్పూరహారతులఁగొని భూగర్భమునుండి మదనమాలినీ మదనవతులు ప్రవేశించుచుందురు.)

మాన—(మదనమాలినీ మదనవతులఁజూచి చివుక్కున నీవలకువచ్చి విస్మయమునహించి తనలో) ఇదేమి?

మదనమాలిని —నాథా! ఏమట్లు విస్మయపడిచూచెదరు? (చిఱునగవున) నే నెవ్వరని తలంచితిరి ? (మదనవతిని దగ్గరకుఁ జేర్చుకొనుచు ఈ వ్యక్తి యెవరో యెఱుంగుదురా? ఆబాలవిదితంబుగ నీ నగర మందు మణిమంతుఁ డను పేరుతో రత్నవర్తక మొనరించుచు సకల దిగ్దంతరాళముల ననేకవిధంబులగు యశశ్చంద్రికలఁ గాంచిన వ్యక్తి యీవ్యక్తి. పదంపడి తమ యనుగ్రహమువడసి యీకోట యందే గృహము నిర్మించుకొనిన వ్యక్తి యీవ్యక్తి. తా నిర్మించుకొనిన గృహమునుండి యీ నా యంతఃపురమున కీ విధిగా

విస్మయజనకమగు నీ భూగర్భ రహస్యద్వార మేర్పఱచిన వ్యక్తి యీవ్యక్తి. మణిమంతుఁడను నామధేయమువనున్న యీవ్యక్తికి భార్యగా సంచరించి శృంగారవతియనియు, శృంగార దేవియనియు సౌందర్యమాలిని యనియు నామములఁ జెలఁవొంది మీ మెప్పు వడసి సతీశృంగారవతి యను బిరుదువహించిన వ్యక్తి మీధర్మ పత్ని నగు నేను, నా సోదరి యగు మదనవతియే యీ వ్యక్తి. మీచే నేనుగా భావింపఁబడి, మీచే ప్రేమించఁబడి, మిమ్ముల నీ కపటనటన జన్యాంశంబుల నిస్సంశయుఁ జేయునంత చాతుర్యము నెట్టి యనుభవములేకయు, రసవంతముగ నీరేయి యింతకు ముందు మీయెడఁ బ్రదర్శించిన వ్యక్తి యీవ్యక్తి. ఈ వ్యక్తి సర్వావస్థలయందును మీప్రేమ సుధారసంబును నాతో సమముగ ననుభవింప నిశ్చయముఁ జేసుకొనియు, సోదరీ వాత్సల్యముఁ జూపఁదలఁచియు, నిట్టి కపటవర్తనమునకుఁ గడంగినది. ఈకపట వర్తనమంతయు నా మనోనువర్తిత్వమున జరుఁగుచున్నది. నా మనస్సు కపటము ననువర్తించుటకుఁ గల కారణము మీరే యూహింపఁగలరు. తెలిసియో తెలియకనో చేసిన మా యీ స్వల్పమగు నేరము సహించి మమ్ముల ననుగ్రహించుటకు కోరుచున్నాము. నా సోదరియగు నీ కన్యకామణి త్రికరణశుద్ధిగ మిమ్ములనే వరించియున్నది. అందుకై నేనే మిమ్ములఁ ద్రికరణాశుద్ధిగఁ బ్రార్థించుచుంటి. మేము మీయందొనగూర్చిన కృత్యమునందలి దోషాదోషములు పాటింపక మా భావ మెఱింగి మమ్ముల క్షమించుఁడు. మీదయకు పాత్రలము. (అనుచు నిర్వురు నాతని పదములపై (వ్రాలుదురు)

మాన—(తనలో) నిజముగ నీ కథయంతయు సత్యమేయైయుండునా? ఐనను గాకున్నను వీరల నిర్వుర నింక నింతటితో విడువరాదు.

(నే పథ్యంబున గంటమ్రోగును)

అదిగో తొలిజాము గంటమ్రోగుచున్నది. ఈ తెల్లవాఱులోపల నింక నెన్ని చిత్రములు జఱుఁగనున్నవో? ఎన్ని జఱుఁగనున్నను వీరల నింక విడువకుండు ప్రయత్నము నేయుదును. ఉన్నను వీరల నింక నమ్మ

టెట్లు? నన్నింక నట్టిమోసముచేసి యదృశ్యులగుదురో? ఐన కానిమ్ము? కాకయున్నచో తేపుదయము స్వస్థచిత్తుఁడనై వీరియందలి నిజానిజములు విమర్శించి యుక్తాయుక్తముల నిర్ణయించుకొందు. (ప్ర) రాజ్ఞీ! యిఁక లెమ్ము? (అనుచు మదనమాలినిని స్పృశించి లేవనెత్తి మదనవతిని స్పృశింపఁబోయి సంశయించి యని విరమించుకొనును)

మదనమాలిని — నాథా! ఏల సంశయించెదరు?

మాన — (చెవునగవున) నీ యాజ్ఞకొఱకు.

మదనమాలిని — (చిఱునగవున) మీ రొనరించు కృత్యంబులన్నియు నా యాజ్ఞానుసారముగనే జఱుగుచున్నవా? లేకున్నను మీరు దయను కోరిన మమ్ము మీ పదము లందు వ్రాలనిచ్చుటయే మదాజ్ఞ.

మాన — ఔరా! అంతకు నంతకు నెంత జాణవైతివే? ఈ నీ సోదరి పేరేమి? మదనవతియా?

మదనమాలిని — ఔను.

మాన — మదనవతీ లెమ్ము? (అనుచు దాని స్పృశించి లేవనెత్తి యిర్వుర బుజములపై చేయివైచి మదనమాలినితో) రాజ్ఞీ! ఈ రాత్రమంతయు నిదురలేకుండుటచే నాహృదయ మస్వస్థముగనున్నది. కొంచెము నీవు వవ్వాలించినగాని నా హృదయము స్థిరపడదు.

మదనమాలిని — (చిఱునగవున) చిత్తము.

మాన — (మదనవతితోఁ జిఱునగవున) ఏమి మదనవతీ?

మదనవతి — (సిగ్గిలి తలవంచును.)

మాన — (మదనమాలినితో) దీని కిపుడు సిగ్గిలుచున్నది?

మదనమాలిని — నాథా! అవివాహిత యగుఁ జిన్నదానికి సిగ్గు కాదా?

మాన — (సాక్షేపముగ) అహాహా! మీ స్త్రీలలో సిగ్గునకుఁ జిన్న పెద్ద తారతమ్యంబులున్నవా? మీ కెప్పుడు నిట్టి సిగ్గే భూషణము. ఈ సిగ్గవ రెఱుంగని సిగ్గు? నాకు తెలియకున్నను మీసిగ్గు స్వరూపమెట్టిదియో సంపూర్ణముగ మీరే నాకు చూపెట్టితిరిగదా? ఇంక నెందుకు రమ్ము. (మదనవతితో) మదనవతీ! రమ్ము (అనుచు నిర్వురతో శయ్యాదాపున కేగుచు మదనమాలినితో) ఐనచో నిజ

ముగా మీచే నిర్మింపఁబడి యొక రహస్యద్వార మీ స్థలమం దున్నదా ?

మదనమాలిని—నాథా ! ఆమర్మము లన్నియుఁ బ్రత్యేకముగనే చూపుదు రండు.

మాన— సరే పద.

మదనమాలిని—(భూగర్భద్వారము సమీపించి) ఇటుచూచితిరా ? ఇది యే ద్వారము. ఈ గదియెల్లయు నెట్లు స్ఫటిక శిలాఖచితమై యున్నదో ఈ ద్వారములు సైతమట్లే భేదవిరహితంబుగ స్ఫటిక శిలాఖచితమై యొరులెఱుంగలేని పనితనంబున నిర్మింపఁబడినవి. పదంపడి లోన ప్రవేశించునంతనే వానికై యవి మూసుకపోవు కీలుయంత్రము సైతము నిందు లోభాగమున నమర్పఁబడి యున్నది. చూచెదరు రండు. (అనుచు నారహస్యద్వారమున నిష్క్రమించు చుండఁగా మదనవతితో మానపాలుఁడు నాశ్చర్యమభినయించుచు నట్లే నిష్క్రమించుచుండగా నవనిక జారును)

( అవనిక లేవఁగా )

( ఉ ద్యా న వ న ము )

[ మానపాలుఁడు మదనవతీ మదనమాలినులతో బ్రవేశించుచు ]

మాన—ఆహా ! మదనమాలినీ! నిజముగా నీ నెంతయుఁ జాతుర్యసీమవు ఈ మదనవతి సైతము నీకంటెఁ బదిరెట్లు మిన్నయని చెప్ప వచ్చును. కాని, ఇంత నిపుణత్వ వంచకలగు మిమ్ము మఱలఁ బ్రేమించుచో (అనుచు సందేహ మభినయించును)

మదనమాలిని—(అర్థోక్తిలో) నాథా ! ఇంకను మీసందేహము నివృత్తి కాలేదా ? నాఁడా తోలినగరబాహ్యారామ సమావేశకాలమందు మీ చిరకాలమిత్రులగు నానంద పండిత వేదాంతి బోధించిన సాంసారిక తత్వమైనను జ్ఞప్తికి వచ్చుటలేదా ?

మాన—(ఆలోచించి) మనోహరీ! నిజము. ఆ యానందపండితుని వాక్యం బులన్నియుఁ బరమానంద ప్రదంబులు. సకలానుభవ వేద్యంబులు లేనిచో

కం॥ స్త్రీయే సుఖముం గూర్చును,
స్త్రీయే దుఃఖంబుఁగూర్చు • స్త్రీయే యధిక
శ్రేయః శ్రేయంబుల నిడు
స్త్రీయే సంసృతినిముస్చు • స్త్రీయే తేల్చున్.

అని చెప్పియుండెను. అది యెల్లయు వరుసగా జఱిఁగియేతీరినది. అందుచే

గీ॥ ధర్మపత్నిం గ్రహించి సం • తతినిపడసి
యజ్ఞయాగాది కృత్యంబు • లాచరించి
సర్వఋణ ముక్తుఁడై ముము • క్షుంబుఁగోర
నగును లేకున్న భ్రష్టుఁడెం • డైన నరుఁడు.

అని యాతఁడు నుడివిన వాక్యంబులన్నియు నవశ్యాచరణీయం బులు. కాని మదనవతిని సైతము.

మదనమాలిని—(అర్ధోక్తిలో) నాథా ! మఱల మదనవతియనియు మదన మాలినియనియు వృథాసందేహములకు పాల్గొనక నిష్కళంక మగుఁ బ్రేమతో మా యిర్వుర నేలుటయే మీ కఖిలార్థదాయ కము. మా జననీజనకులకు జనించిన కుమారికలము మే మిర్వు రము. అట్టి మమ్మిర్వురను విధ్యుక్త వివాహితలఁజేయు నోము నోచకపోయితిమే యను విచారమున మున్ను మా జననీజనకుల నెట్లో సమాధానపఱచి యింత కార్యక్రమమునకు గడంగుట యెల్లయు లోకోపకారమునకై గాని మా తెలివితేటలఁ బ్రదర్శిం చుటకై కాదు. దయచేసి మమ్మిర్వుర ననుగ్రహించి నిష్ప్రయో జక చింతావివర్జితులై నిష్కళంకిత ప్రేమార్ద్ర స్వాంతులై సక లార్థంబుల ననుభవించుట కిదే ప్రార్థించుచున్నాను. (అనుచు నాతని పదములపైఁ బడును)

మాన—(గ్రుచ్చియెత్తి) ప్రేయసీ! మీ చరిత్ర మంతయు నిష్కళంకమని మీ యీ కపటనాటకమే చెప్పక చెప్పుచున్నది. ఐనను సర్వ స్త్రీజనంబులు నిట్లే భర్తృమానసవర్తినులై, సకల విద్యాచతు రిణులై, సౌందర్యపుంగనులై యున్నచో పురుషుల కిదే స్వర్గము. కాని నిజముగ పురుషుఁడగువాఁడు లేనిపోని పరీక్షలకుఁబూని

భార్యను చెఱఁబెట్టుటయు, పరస్త్రీ ధర్శనా కుతూహలుఁడగుటయు, నిరంతర దుఃఖభాజనంబని యిందు నా చరిత్రము చెప్పుచున్నది. నిజముగ పురుషుం డిట్టి విషయంబులం జేరుచో నెంత పరిశుద్ధాత్ముండైనను సర్వభ్రష్టుండగుటలో సంశయమున్నదా? (మదనవతినిజూచి) మదనవతీ! నీవెవరవో తెలియకమున్న నిన్ను నా భుజములపై నలంకరించుకొంటి. ఇంకనుండి గంగావరమేశ్వర న్యాయంబున నిన్ను పాలించుదు. (మదనమాలినిజూచి) రాజ్ఞీ! మున్మూరులకు నీకిది యంగీకారమేనా?

మదనమాలిని—నా యంగీకారము లేనిదే మీ రంగీకరించుట కవకాశముకలుగ లేదని గ్రహింపుడు.

మాన—(చిఱునగవున) మదనవతీ! నీ సోదరియగు నీ మదనమాలినికి నాయం దెట్టి పదవియున్నదో నీకు నట్టి పదవి నిప్పుడే యొసంగితి. కాని ఇప్పుడు నాయొక యభిప్రాయంబునకు మీ రిర్వురుఁ గలసి శ్రేయోభివృద్ధిని గోరవలె.

మదనవతి—చిత్తము. (అనుచుఁ దలవంచును)

మాన—(మదనమాలినితో) ప్రేయసీ!

గీ॥ అఖిల పురుషులు నిష్కళం • కాత్మలౌచు
ధర్మబద్ధులై నిగమోక్త • కర్మఠులయి
చెలఁగుచుందురు గావుత • స్త్రీజనంబుఁ
గరమునన్లైయె విఖ్యాతిఁ • గాంచుగాత.

మదనమాలిని—
మదనవతి— } (శిరములు వంచుచు) శుభం. శుభం. శుభం.

(అవనిక జారును)

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 29 | గూడునే | కూడునే |
| 4 | 23 | మానగు | మానుగ |
| 5 | 12 | పర్తి | పరి |
| 6 | 12 | వడయు | వరలుఁ |
| ,, | 17 | సఫలతొందలేదు | సఫలుఁడెందుఁగాఁడు |
| 8 | 15 | న్రిష్క | నిష్క్ర |
| ,, | 21 | అనుచున్రిష్క | అనుచుఁ గిరీటము సింహాసనముపైనుంచి నిష్క్ర |
| 13 | 5 | అనుచు. | (అనుచు, |
| ,, | 21 | చెంగ | చెలంగ |
| 15 | 14 | యతి | వతి |
| ,, | 21 | కోట | కోనుట |
| 16 | 1 | ఐనచో | ముందు |
| 17 | 23 | రించదేనికి! | రింపనేటికి |
| 18 | 21 | వ్యక్తైవ | వ్యక్తియెవ |
| | | ఈవిషయంబున నంతట నిట్లే గ్రహించునది. | |
| 21 | 11 | మనోసార | మనోనుసార |
| 22 | 5 | విజయ-మంచిది | విజయ-(ఆలోచించి) మంచిది. |
| 27 | 10 | (ఉ, "వ"కు విరతి "న"గా సరిచేయునది.) | |
| 29 | 18 | పంబుకంత | పంబునంత |
| ,, | 14 | ముగుదుల | ముఁగుదల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 28 | 3 | పించెదవా! | పించుచున్నావు. |
| 32 | 8 | హారముల | ఈహారముల |
| 33 | 8 | తనమెడలో | (తనమెడలో |
| 36 | 3 | మాత్రముచేయున దేమున్నది. | చేయునదిమాత్ర మేమున్నది. |
| ,, | 5 | వాఁడైనను | వాఁడైన |
| 40 | 25 | శ్రీల | స్త్రీల |
| 45 | 9 | మనభర్తన్గా | మునభర్తన్గా |
| 46 | 21 | వయోః | వమొన్వి |
| 47 | 2 | భర్త్య | భర్త్రి |
| ,, | 3 | కూడనా! | కూడునా! |
| 48 | 11 | బట్టు | బట్టఁ |
| 51 | 21 | ఃవృద్ధగా | ఃఫురబద్ధగా |
| 54 | 9 | గులుకుతో (మాఁగ్సు,) | జెలువుతో |
| 54 | 27 | సర్వాశృతి | సర్వాశృతి |
| 56 | 8 | ముగుదుగా | ముగుదగా |
| 58 | 2 | డేమిం | డేం |
| 59 | 7 | పోతే | ఐతే |
| 63 | 13 | మణిమణి | మణి |
| 70 | 16 | నిశ్చయము. | నిశ్చయము! |
| 71 | 5 | నేవరి | నెవరి |
| 75 | 22 | ైనవి | ైనది |
| 76 | 4 | అనుచు | (అనుచు |
| ,, | 18 | వగునెమద | వగు, నేమద |
| ,, | 19 | దానినే మహా | దాని? నే మహా |
| ,, | ,, | యిష్టంబు | యిష్టంబగు |
| 78 | 7 | తనలో | (తనలో) |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 13 | యెవ్వతో | యెవ్వతో |
| ,, | 14 | మద్ధ | ముగ్ధ |
| ,, | 25 | నావతము | నాకీవతము |
| ,, | 28 | రాఞ | రాజ్ఞి |
| 79 | 14 | వేరు | వేఱు |
| ,, | 26 | దత్కృతి | దుష్కృతిఁ |
| 84 | 13 | చోర్యాది | చోరాది |
| 85 | 5 | గర్భమ | గర్భము |
| 86 | 5 | వానిదైనవన | వానిదైన, వన |
| 89 | 11 | సంతన | సంతస |
| ,, | 12 | వద | పద |
| 91 | 12 | అఁ | ఆఁ |
| 92 | 7 | ఆయింక | ఇంకా |
| 97 | 27 | ప్రవదర్శించు | ప్రదర్శించు |
| 98 | 16 | సతిత్వ | సతీత్వ |
| ,, | 19 | ఒనచో | ఐనచో |
| 99 | 7 | వన్నిటుల | నిన్నటుల |
| ,, | 20 | వ్యా | వ్యా |
| 104 | 26 | తోనకి | తోణఁకి |
| 114 | 17 | గాంచగ | గాంచంగ |
| 118 | 13 | గూరు | గూర్పు |
| 119 | 23 | నేనిటుల | నే ఇటుల |
| 122 | 3 | విభ్రమేమి | విభ్రమమేమి |
| 126 | 1 | డించినను | డించి; నను |
| 128 | 18 | నూనుచో | పంతమూనుచో |
| ,, | 23 | చెకి | చెడ |
| 131 | 6 | దుష్కృత | దుష్కృతు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 16 | యండె | అండె |
| 132 | 10 | లోనర్చి | లోనర్చినేఁ |
| 47 | 24 | యుంటిరా? | యుంటిరా! లేదా! |
| 49 | 16 | వైచినను | వైచి, నను |
| 50 | 5 | చివా=ముగ | (చివా=ముగ) |
| 51 | 14 | వంకద్వా | వంకఁ ద్వా |

ఇంక నిట్లే యనేకములుగాఁ బొరపాటులున్నవని సంశయమున్నది. అవి చదువరులే గ్రహింపఁ బ్రార్థితులు. మఱియు నచ్చునట్టుఁ బ్రమాదంబుగ సంధిదోషంబులుఁ గూడియున్నవి. వాని సమర్థించుకొనుట కాధారములున్నను ద్వితీయముద్రణమున సవరింపఁబడును.

